# గిరిజన ప్రగతి

★



రచయిత :

భూక్యా

★

ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ గిరిజన సంక్షేమసంఘము గుంటూరు

**Regd. No. 119/75**

స్వామ్యములు : గ్రంథకర్తవి :

ప్రథమ ముద్రణ : ప్రతులు — 600

1979 జూన్



మూల్యం : రు 10/-

ప్రతులకు :

భూక్యా చిన్న వెంకటేశ్వర్లు

పత్రికా సంపాదకులు :

1/2 శాకమూరు వారితోట

అరండల్ పేట (పోస్టు)

గుంటూరు-2 (ఆం. ప్ర.)

# అంకితము

ఆర్యా !

మన రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములవారు బలహీనవర్గాల ప్రజలకు, బృహత్తర కార్యక్రమములు ఏర్పరచుట, వారి సాంఘిక జీవన ఉపాధికల్పనకై వందలాది కోట్ల రూపాయలు వెచ్చించుచున్నారు. ప్రధానమంత్రి శ్రీ మురార్జి దేశాయి, రాష్ట్రముఖ్య మంత్రి డా॥ మర్రిచెన్నారెడ్డి గార్లు సంక్షేమ కార్యక్రమములకు పలువిధములైన స్కీములను ప్రవేశ పెట్టిరి. కాని సరిఅయిన ప్రభుత్వ యంత్రాంగము లేనందున అభివృద్ధి కార్యక్రమములు కుంటు పడుచున్నవి. ఉద్యోగ నిర్వహణలో అధికారులు తమ బాధ్యతలు విస్మరించి, అవి నీతికి పాలుపడుచున్నందున గవర్నమెంటువారు ప్రవేశపెట్టు కార్యక్రమములు విజయవంతము కావటంలేదు.

ముఖ్యముగా గిరిజనప్రాంతములలో శ్రద్ధగల ప్రభుత్వ అధికారులు చాలతక్కువమంది ఉంటారు. వారిలో శ్రీ పి. అబ్బన్న A. P. A. S. గుంటూరుజిల్లా జాయింట్ కలెక్టరు గారు ఒకరు.

శ్రీ పి. అబ్బన్న రాష్ట్రంలో అన్ని జిల్లాలలో వివిధ రకములైన పోస్టులలో ఉద్యోగరీత్యా సేవలుచేశారు. ముఖ్య ముగా భద్రాచలంలో ఏజెన్సీ ప్రాంతములలో గిరిజనుల మధ్య సేవచేయుటకు ప్రభుత్వము వారికి అవకాశము కల్పిం

చిరి. ఆ కాలములో ఆ ప్రాంతపు ప్రజలు శ్రీ అబ్బన్నను ఎంతో గానో ప్రేమించినారు. వారిలో ఒక వ్యక్తిగా ఉండిపోయి నారు. దురదృష్టవశాత్తు భద్రాచలంనుండి ట్రాన్సఫర్ చేసి నందుకు ఆ ప్రాంతపు ప్రజలందరూ ఊరేగింపులుచేసి, విజ్ఞాపనపత్రములు ద్వారా ప్రభుత్వమునకు విన్నవించు కొన్నారు.

రాష్ట్ర శ్రేయస్సే ధ్యేయంగా, క్రమశిక్షణ మార్గంగా నిర్ణయించుకొని పనిచేసే కొద్దిమందికి అధికారులలో శ్రీ పి. అబ్బన్న గారు ఒకరు. అట్టివారి సేవలు ప్రతి ఒక్కరికి తెలిసిన విషయమే! వారు సేవాదీక్ష — నీతి నిజాయితిలకు మారు పేరు. కావున అటువంటి సంఘ సంస్కర్త అయిన శ్రీ. పి. అబ్బన్న A. P. A S గార్కి ఈ గిరిజన ప్రగతి పుస్తకమును అంకితముచేసి ఉడుతా భక్తిని సమర్పించుకొను చున్నాము.

ఇట్లు
హీరా భూక్యా
రచయిత.



## శ్రీ గుంటూరు జిల్లా జాయింట్ కలెక్టరు

## పి. అబ్బన్న A. P. A. S. గారి

# అభినందన గీతికామాల

శ్రీ మదాంధ్ర పవిత్ర ధాత్రీ తలాన
పేరుగల్గిన మేలిగుంటూరుసీమ
నేలుచున్న అబ్బన్నరు శ్రీలు మేల
పారముగ కూర్చి బ్రోచుత భారతాంబ

ఘనుల సాహిత్య గాంభీర్య గర్భశుక్తి
శాంతిముక్తా ఫలమ్ము విశ్రాంత యశుడు
గిరిజన ప్రగతి కృషి పండితము గొన్న
సత్కళా పోషకుండు విజ్ఞాన ధనుడు

ఆశమై స్వీయ కృషిని విద్యార్జనమ్ము
చేసియున్ సతీర్థులలో ప్రసిద్ధిగొన్న
సవినయగ్రాహి ఆదర్శ ఛాత్రవరుడు
చదువు సంపాదనముల మొట్టమొదటి వాడు

వసతి గృహముల యందు నివాసముండి
శ్రద్ధతో నిశిదిని కళాశాల కేగి
సత్ఛాత్రులయందు ప్రప్రథము డగుచు
న్యాయ శాస్త్రాభ్యసనము నొనర్చె నాడు.

వరుస గుడివాడ కొవ్వూరు నరసిపట్ట
ణమ్ము నమలాపురమ్ము వసంతపురము
పుణ్య భద్రాచలముల నగణ్య ధర్మ
పాలకుండగు సద్ధర్మ రథికుడితడు.

మహిళసాంఘిక సంక్షేమ మంత్రివరుల
కార్యదర్శిగ ప్రజకు సౌఖ్యమ్ము గూర్చి
పేదలకు ప్రభుత్వమునకు ప్రీతిపాత్రు
డై ధ్రువమ్మగు సద్యశమ్మందినాడు

వినుతి ఫైనాన్సు కార్పొరేషనుకు సర్వ
కారనాధిక్యములుగల్గి కార్యశూరు
డైన జనరల్ మేనేజరై ప్రశంస
లందుకొను బుధప్రకర కూరాయమానంగ

వయముగా గురజాల తెనాలి యందు
పాలితుల పాలకుల సమస్యలను దీర్చి
శర్కర ఫ్యాక్టరీల డైరెక్టరులకు
మేలు బంతిగ చెలిమితో మెలగినాడు

సుప్రసిద్ధినిగొన్న యాంధ్రప్రదేశ
న్యాయపరిపాలనా బాధ్యతాయుతంపు
శక్తి యుక్తులుగల్గి ప్రజ్ఞాధురీణు
డనగ పరిపాలకులలోన గణనకెక్కె

అబ్బ లేనట్టి వారల కబ్బవగుచు
అన్న లేనట్టి వారల కన్నవగుచు
అత్యధిక ప్రేమమూర్తి వీవగుదువనుచు
అమ్మనాన్న నిన్ బిల్చిరి "అబ్బన్న" యనుచు

పాదపము నీడ నివసించు పేదజనుల
కిండ్లు గట్టించి బంజరులిచ్చి పాడి
పసులనిచ్చి, ప్రజా ప్రభుత్వపు సౌమ్య
ధర్మ సరణి బంచిన నెరదాత యితడు.

దేవళమ్ముల గనరాని దేవదేవు
పేదసాదలలో జూచి ప్రేమమీఱ
నాదరించి తరించు భక్తాగ్రగణ్యు
డఖిల మతముల సమత గలట్టివాడు.

బుద్ధ క్రీస్తు సబర్మతీ మునివరేణ్యు
లాత్మ దైవమ్ము లైయుండ నహరహమ్ము
దీనజన సేవయే తనధ్యేయ మనెడి
ధీరశాంతుడు మండలాధీశుడితడు.

గిరిజనుడు మామ అల్లుడు హరిజనుండు
కావ్య బంధుత్వమిక భావి కాలమందు
హరిగిరిజన వర్ణాంతర పరిణయములం
జరుగనీ కృతి స్వీకార చరిత సాక్షి

శాంత సుందర శివమై ప్రశస్తిగొన్న
ప్రగతితో నున్నతోన్నత పదవులంది
స్నేహశీలియౌ కమలా మనోహరుండు
వర్ధిలును గావుతన్ శత వత్సరములు.

విద్వాన్ బి. యేలియ.

# గిరిజన ప్రగతి

## మొండిబండ

వివిధరకములైన సంచార జాతులలో ఇదిఒక ప్రత్యేక జాతి. ఈ జాతిని తమిళనాడులో మొండివాళ్ళని అందురు. వీరికి పూర్వులు పెట్టిన పేరు పూర్తిగా మొండిదే. వీరు పని తనములో మొండిగా వ్యవహరించెడివారు. వీరికి కోపము ఎక్కువ. వీరు యాచించి జీవించుట వీరి ముఖ్యవృత్తి. వీరు అడుక్కొనుట చారిత్రాత్మకముగా యుండును. దాదాపుగా గలాట మాదిరిగా యుండును. కొన్నిచోట్ల యాచించునపుడు పెద్దపెద్ద బండలు తీసుకొని ఇంటిముందర బోర్లా పడుకుంటారు. వారు భిక్షము వేయనియెడల ఆబండతో తలబాదుకొంటారు. ఇది చూచిన వారెవరైన భయముతో వచ్చి భిక్షము వేస్తారు. మరికొంతమంది కత్తులతో, చాకులతో, ముండ్లతో తొడలుపైన, ముఖముపైన కాలుపైన కోసుకుంటారు. వీరికి కోపము వచ్చినయెడల రాళ్ళు, మట్టి, ఇసుక ఇండ్లముందర తూర్పువాలుగా పోయుదురు. దేశచరిత్రలో ఈ జాతులలోకెల్ల వీరిప్రవర్తన అతిముఖ్యమైనది.

వీరు యాచించునపుడు వారసత్వము నుండియు వారి సంతానమునకు వాంతి చేసుకొనుట, త్రాగుట మొదలగు విద్యలు బాల్యమునుండే నేర్పెదరు. వీరు బాటలనుండి వెళ్ళ

వచ్చేదు, వీధులనుండి వెళ్ళునపుడు ఈ రకములైన విద్యలను ప్రదర్శించగలరు.

ఈజాతివారు దేశములోని పలు ప్రాంతములలో గుంపులు గుంపులుగా బయలు దేరుతారు. వారిప్రదేశాలను వారు ఎన్నుకొంటారు. ఒకరి ప్రాంతములో మరి ఒకగుంపు ప్రవేశించిన యెడల వారికి కులతప్పు వేస్తారు. వీరికి కుల ఆచార వ్యవహారములు, కట్టుబాట్లు మెండు. వీరు ఆంధ్ర ప్రాంతములో ఎక్కువగా తిరిగెదరు. వీరు మాంసాహారులు. వీరికి జముడుకాకులను తినుట అలవాటు. వీరు గృహములను అందముగా తీర్చిదిద్దుకొనునట్లుగా పూర్తి ఇళ్ళను నిర్మించు కొంటారు. వీరికి అడుక్కొనుట జన్మహక్కుగా పరిగణిస్తారు. దీనిని వీరు వంశపారంపర్యముగా భావిస్తారు.

వీరికి పశువులను పెంచుట ముఖ్యవృత్తి. వీరురైతులు భూస్వాములు, రేమాదుల ఇండ్లయందు జీతానికి పనిచేసి, వారి పశువులను అడవులలో కావలాకాస్తారు. పశువుల మల మూత్రములను పెంటనువ్వులుగా తయారుచేసి వ్యాపారము చేసెడివారు. వీరిలో దొంగతనము చేయుట అరుదు. ఒకవేళ దొంగతనము చేసినయెడల కాళ్లు, చేతులు నరికివేస్తారు. వ్యభి చారము వృత్తి అలవాటులో యుండెడిది. అటువంటి వారిని కులము, నసాబు (పంచాయతీ) పెట్టించి, ఇరువురను రప్పించి,

తప్పొప్పులను విచారించి, కులపెద్దలు శిక్ష విధిస్తారు. తర తరాలుగా ఈజాతి వారిని రైతులు వెట్టిచాకిరి చేయించు కొనినట్లు వాడుకలో ఉన్నట్లు కొన్ని కథలు చెప్పుచున్నారు.

ఉదా॥ ఒక మొండిబండ కుటుంబము రైతులవద్ద కవులుకు కుదురుతారు. వారికి సంవత్సర జీతము క్రిందనో, పెండ్లిఖర్చు క్రిందనో షుమారు రెండువేల రూపాయలు అరువు ఇస్తారు. రైతులు ఆబాకీకి వడ్డిమీద వడ్డీలు కట్టుకొని తరాల వారిగా వారితో వెట్టిచాకిరి చేయించు కొంటారు.

ఈ విధముగా వారిజీవితములు ఎడారిలో పయాసిస్సు లుగా, ఉండుట ఆశ్చర్యదాయకము. మానవజీవన ప్రవం తిలో పలురకములైన బాధలకు వీరిని సమాజము గురి చేస్తుంది.

ప్రభుత్వము తీసుకొనవలసిన జాగ్రత్తలు :—

ఈజాతి సంచార జాతుల జాబితా క్రింద ఉన్నది. వీరు నివసించుటకు గ్రామముల మధ్యలో కాలనీలు ఏర్పాటుచేయ వలయును. వీరికి వృత్తి సౌకర్యము కొరకు చేతివృత్తులను ప్రవేశపెట్టవలెను. వీరిపిల్లల విజ్ఞానముకొరకై పాఠశాలలను పెట్టి వీరికి హాస్టలు వసతి, బట్టలు మొదలగునవి ఏర్పాటు చేయవలయును. వీరికి వ్యవసాయము ముఖ్యవృత్తి కావున ప్రభుత్వము వారు ఫారెస్టు బంజరు భూములను విడగొట్టి, పట్టాలుయిప్పించవలెను. వ్యవసాయమునకు పనికివచ్చు పశు

కరములు, పనిముట్లు సబ్సిడీగా ఇప్పించవలెను. ఎరువులు, రసాయనిక మందులు మొదలగునవి బి.డి. ఓలు భూమితనఖా బ్యాంకువారు వారిభూములను తాకట్టుపెట్టించి ఋణములు మంజూరుచేయించవలయును. వీరికి వృద్ధాప్యపు పెన్షను గ్రాంటుచేయించవలెను. యువకులకు గిరిజనసంక్షేమ డిపార్టు మెంటుద్వారా పలువిధములైన శిక్షణయిప్పించి వారికాళ్ళ మీద జీవించునట్లుగా చేయువలయును. వీరికి రిజర్వేషను ప్రకారము ఉద్యోగ వసతి కల్పించవలయును.

వీరికి ఆచార వ్యవహారములు, కట్టుబాట్లు, కుల పంచాయితీలను ప్రభుత్వమువారు చట్టముద్వారా నిషేధించి, వారికి తోడ్పడవలెను. వీరిని అగ్రకులాలవారినుండి, వెట్టిచాకిరి నుండి రక్షించవలెను. వీరికి వాయిద్యములు వాయించుట, పండుగసమయములందు నృత్యము చేయుట, పాటలు పాడుట, వీధినాటకములు వేయుట, ముఖ్యవృత్తులు. కావున ప్రభుత్వమువారు వినోదకార్యక్రమాలను పెట్టించి వారిలోని కళకు సహాయము చేయవలయును.

* * *

## బుడబుక్కల

వీరు యావత్ ఆంధ్రరాష్ట్రములో పర్యటించెదరు. వీరు విచిత్రవేషధారణము చేసుకొని సంవత్సరకాలములో గ

మాసములు (1 నవంబరునుండి మార్చి నెలాఖరువరకు) గ్రామములలో తిరుగుతూ, ప్రొద్దున కోడికూసిన తర్వాత దర్శనమిచ్చెదరు. వారు పాతగుడ్డలను అడుక్కొంటూ, ప్రతి ఇంటి వద్దకు వచ్చి ఆశీస్సులు చెప్పుచూ, జ్యోతిష్యం చెప్పుట వీరి అలవాటు. వీరు వినాయకస్వామి, ధరియం ఢమరం లాంటిది ఎడమచేతి సాని వేళ్ళతో పట్టుకొని కుడి ఎడమలకు త్రిప్పుతు లయబద్ధముగా వాయిస్తారు. వివిధరకములైన రంగు వస్త్రములను ధరించుట వీరి ప్రత్యేకత. వీరు ముఖమునిండా తెల్లటి రంగు వేసుకొని, వేంకటేశ్వరస్వామి అవతారములాగా మూడు నామాలునొసటన దిద్దుకొని, కాళ్ళకుగజ్జలు కట్టుకొని, కుడి చేత్తో లాంతరు ధరించి గ్రామాలలో సంచరించుటం వీరిముఖ్య అలవాటు. వీరు యాచించేటప్పుడు భిక్షము పెట్టటము ఆలస్యమయితే "భగవంతుడు మీకు పిల్లల్ని యిస్తాడు, పాడిపంటలు సమృద్ధిగా పండుతాయి" అని కోపంగా దీవిస్తారు. దానితో గృహిణులు వీరి పోరుపడలేక భిక్షము పెడతారు. చిన్నపిల్లలు, స్త్రీలు వీళ్ళను చూచిన చాలాభయము చెందుదురు.

వీరు మన రాష్ట్రంలోని ముఖ్యముగా రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో ఉండెడివారు. హైదరాబాదు నిజాం సంస్థానముల వారికి ప్రత్యేకస్థానము కలదు. వీరు సంవత్సరకాలములో 6 మాసములు నవాబులను దీవించుచూ, వీధుల వెంట తిరిగేవారు. వీరి పోషకులు గాను, నవాబు?

500 ఎకరముల పొలమును మాన్యముగా ఇచ్చినారట. వీరిని ప్రతి సంవత్సరము జనవరి 1వ తేదీన పట్టు వస్త్రములతో సత్కరించుట అలవాటు. కావున వీరికి సంఘములో ప్రత్యేకమైన స్థానము కలదని తెలియుచున్నది.

వీరు గ్రామాలకు శివార్లలోను, రోడ్డుప్రక్కలలోను, దేవాలయములందో సత్రముల యందో ఉండుట వీరికి అలవాటు. వీరు మాంసాహారులు. వీరు కేడ్ బాలు తీసుకొని సాయంకాలసమయములందు పిట్టలను, పావురాళ్ళను గురిపెట్టి కొట్టి కాల్చుకొని తినుట వీరికి సరదా.

ప్రభుత్వం తీసుకోవలసిన చర్యలు :- వీరికి ఆశ్రమ పాఠశాలలు కల్పించి వృత్తి నిమిత్తం, కుటీర పరిశ్రమలు స్థాపించవలయును. వీరికి మానవనాగిరికత తెలియ జేయడం ద్వారా, చలన చిత్రపరిశ్రమ ద్వారాను, వీధినాటికల ద్వారాను, వీరిని చైతన్య వంతులుగా చేయవలయును. వీరికి సంగీతము పాడుట అలవాటు. వీరిని ప్రభుత్వ సంగీత పాఠశాలల యందు చేర్పించి, వారి కళను అభివృద్ధి చేయుట ప్రథమ కర్తవ్యము. వీరిలో చదువుకొన్న యువకులకు ప్రభుత్వం వారు వివిధ పరిశ్రమల యందు, వొకేషనల్ ట్రైనింగ్ శిక్షణ ఇప్పించి, ఉద్యోగవసతులు కల్పించవలయును. ప్రభుత్వం వారు శ్రద్ధ చూపితే ఈ జాతివారు ఈ వృత్తులను మానడం పెద్ద కష్టమేమీ కాదు.

# మిజోరామ్ గిరిజనులు - ఒక పరిశీలన

పూర్వం అస్సాంరాష్ట్రములో ఒక జిల్లా అయిన మిజోహిల్స్ నేడు మిజోరామ్‌రాష్ట్రంగా చేయబడింది. దట్టమైన అరణ్యములచేతను, అరుదుగా కన్పించే చిత్రవిచిత్రమైన పశు, పక్ష్యాదులచేత నిండిన కొండ ప్రాంతము. మిజోరామ్ అంటే మిజోగిరి జనరాష్ట్రం. ఇప్పుడది కేంద్రపాలిత ప్రాంతం. కేరళ రాష్ట్రములో కొంత విస్తీరణ కలిగి 4 లక్షల జనాభా కల్గియున్నది. దక్షిణ తూర్పు ప్రాంతాన బంగ్లాదేశ్, పశ్చిమాన మణిపూర్, ఉత్తరాన అస్సాం, ఎల్లలు కల్గియున్నది మిజోరామ్.

ప్రజలు :— నూటికి 90 నుండి 95 మంది ప్రజలు మిజో గిరిజనులు, మిగిలిన ప్రజలు బాంగ్లాదేశ్ పరిసరాలలో యుండే చక్మాలు. మిజో గిరిజనులలో చెప్పుకోతగ్గ లఖరి, పేసి, కొంకి ప్రజలు పేరుకు విడిగా వేరుజాతులు కల్పించినా మతరీత్యా ఒక్కటిగానే యుంటారు. మిజోరామ్ ప్రజలు చైనా, జపాన్, బర్మా ప్రజలవలె మంగోలు జాతికి చెందిన వారు. వారు పొట్టిగా, దృఢంగా అందంగా ఉంటారు. వీరు నిజాయితీ, గల్గి నిరాడంబరంగా, ఆత్మీయత కల్గియుంటారు. ఇంతటి మంచివారైన మిజోరామ్‌ప్రజల్ని పరిసర ప్రాంత ప్రజలు దోచుకొన్న కారణంగా, నేడు వారిలో ఇతరులపై అపనమ్మకం చోటు చేసుకుంది.

మతం :- మిజోలంతా క్రైస్తవులు. చక్మాలు బౌద్ధులు. మిజో ప్రజలు మత తత్వ వాదులు, వారి నిత్య జీవితంలో మతం ప్రతిబింబిస్తుంది. మిజోలు యుద్ధగిరిజనులు ప్రకృతి శక్తులపై దృఢమైన నమ్మకతో జంతువులను వేటాడి జీవించెడివారు. బ్రిటీషువారు మిజో తమ ఆధిపత్యంలోనికి తెచ్చిన తర్వాత క్రైస్తవ మతబోధనలు, ఈ ప్రజలలో సాంఘిక, సాంస్కృతిక విషయాలలో పెద్దమార్పు తీసుకొని వచ్చినవి. చక్మాం తెగవారు మాత్రం ఈ క్రైస్తవ మతాంతరీకరణను అంగీకరించ నందువల్ల, వారు అభివృద్ధి చెందనందు వల్ల వారి పరిస్థితులు ఇంకనూ దమనీయంగానే యున్నవి.

సంస్కృతి :- క్రైస్తవ మతాంతరీకరణ వల్లవారి నైజకమైన మూఢ విశ్వాసాలపై మార్పు వచ్చినా వారు గిరిజన సాంస్కృతిని, సాంప్రదాయాలను నిలబెట్టుకొన్నారు. వారి పండుగలు, నృత్యాలు, వారిసాంస్కృతికి ప్రతిబింబాలు. పాటలు పాడడం, నృత్యం చేయడం ప్రతి కుటుంబంలోను యుంది. అంతేగాక ప్రతికుటుంబానికి పక గిరాటా యుంటుంది.

సంఘం :- మిజోరామ్‌ల సంఘం సంఘీభావ సమ్మిళితం. వారు సహజీవన సిద్ధాంత ఆధారంగా జీవిస్తారు. పెద్ద పెద్ద ఆడంబరాలకు పోక ఉన్నదానితో సరిపెట్టుకొని, కొద్దిపాటి సౌకర్యాలతో సుఖముగా జీవించుటయే వారి లక్ష్యంగా

కనిపిస్తుంది. వారిలో ఒకరు నష్టపోయినా మిగిలినవారందరు ఆనష్టాన్ని భరించి, అసలు అతనికి కష్టం కాకుండా చూస్తారు. యువకులు, యువతులు ముందుకు వచ్చి, సంఘ అభివృద్ధికి పాటు పడతారు. మిజోల సంఘం స్వేచ్ఛాయుతమైనది. ప్రపంచములో స్వేచ్ఛాయుత సంఘాలలో ఇది ఒకటి.

బాలలు, బాలికలు స్వేచ్ఛగా తిరుగుచు, వారి వారి ఇష్టాల మేరకు, జీవిత భాగస్వాములను నిర్ణయించుకొంటారు. వారు పశ్చిమ దేశాల వారి పద్యములను ఎక్కువగా అనుకరిస్తు యుంటారు. ప్రతి గ్రామంలో ఈ విధమైన ఆధునాతన, పశ్చిమ దేశాల పద్యములను అనుకరించడమువల్ల యువకులలో అవినీతి పెరిగిపోయింది. త్రాగుడు, మందులు ఎక్కువగా వాడినందువల్ల, సాంఘిక పరమైన కట్టుబాట్లు లేనందువల్ల విపరీతమైన పరిణామములు ఏర్పడుచున్నవి.

## పాములవారు

మనదేశంలో సంచార జాతులలో పాములవారు కలరు. వీరిలో నూటికి 90% పాములను, కప్పలు, తేళ్లు మొదలగునవి ఎడారులయందు, చిన్నచిన్న వాగులయందు, మురికి కాల్వలయందు, కుగ్రామములలోని కుంటలయందు లభ్యమగు వాటిని పట్టుచు ఆంధ్ర, రాయలసీమ ప్రాంతములందు ఎక్కువగా కనిపిస్తారు. వీరు పాములను పట్టుకొని,

వాటిని బుట్టాయందు బంధించి, తమపిల్లలుగా మచ్చికచేసు కొంటారు. పాముకు ఆహారముగా చిన్నచిన్న కప్పలను ఇస్తారు. వీరు పలురకములైన పాములను బంధించి, ఆడించుట మనము నిత్య జీవితములో చూస్తాము. పాములు వీరివద్ద ఒక సంవత్సరము లేక ఆరుమాసములకన్నా జీవించుట కష్టము. కారణము సరియైన పోషణ జరుగదు. వీరు పాములను ఇండ్ల ముందు ఆడించితే అన్నము, వస్త్రములు, పైసలు యిస్తారు. కొంతమందిలో మాత్రం కులవృత్తిని పాటించక, రైతులవద్ద కూలిపని చేస్తున్నారు. కొంతమంది కళాశాలలకు, హైస్కూళ్ళకు వైద్యకళాశాలలకు కప్పలను, జలగలను పట్టి, అమ్ముచు బ్రతుకుతూయుంటారు.

పాము కోరలయందు విషముండును. గావున, వీరు పాము కోరలను గుడ్డవంటిది చేసి పెరికివేస్తారు. తర్వాత విషమును పట్టి, సీసాలో పోస్తారు. దీనిని ప్రయోగశాలలకు లేబరేటరీలకు విక్రయించుట వీరికి అలవాటు. రోగి కొనరి ప్రాణము పోవుచున్న సమయమునందు పాము విషమును గొంతులోపోస్తే బ్రతుకుతుందురు అని వాడుకలో ఉండెడిది. వీరిలో కొందరు వైద్యము (ఆయుర్వేదం పట్ల క్రియలతో) చేయుదురు. వీరికి అనుదినము గండముతో గడిచి పోతుంది. వీరిలో ఎక్కువమంది పాము నృత్యము చేస్తారు. ఆడువారు సన్నని పరికిణీలు ధరించి, నాగ నృత్యము చేసెదరు. ఇది వీరి కళకు తార్కాణము. వీరు పాముల చర్మములను అమ్ము

కొంటారు. చాలామంది పాముకాటుతో మరణించుట మనము చూస్తూయుంటాము.

వీరి పిల్లలకు పాములబుట్టలవద్ద ఆడుకొనుట అలవాటు. పిల్లలు భగవంతుని స్వరూపులు కావున పాములు విషజంతువులు అయినను వారి జోలికి పోవు. మరియు రబ్బరు బంతుల్లాగా సాగదీస్తూ ఆడుకొంటారు. మానవదైనందిన జీవితము ఎంత తేలికో జీవించుట అంత కష్టము.

వీరిలో ఎక్కువమంది మాంసాహారులు. శాఖాహారములు వీరు వాడరు. జొన్న రొట్టెలన్ను, పశువు మాంసమును వండుకొన్న రోజున వారికి పండుగ. వీరిలో జంగు పిల్లులు, ఎలుకలు, పావురాళ్లు తింట్లారని వాడుకలో యుండెడిది. వీరిలో కట్టుబాట్లు లేవు. కులమునకు కులపెద్ద ఉంటాడు. ఎవరైన ఏదైన తప్పుచేస్తే కులపంచాయితీ పెట్టి తప్పుచేసినవారికి జరిమానా వేసి, ఆ డబ్బుతో కులము పెద్దలు, గూడెము జన సముదాయముతో మద్యపానం, మాంసాహారముతో పండుగ చేసుకొనుట వీరి ప్రత్యేకత.

వీరు అతిభయంకరమైన విషజంతువులతో సహవాసము చేయుచున్నారుగావున, ప్రభుత్వమువారు వీరికి వృత్తివిద్య, పని కల్పించిన యెడల కొంతవరకు వీరిదైనందిన జీవితములో మార్పువచ్చుటకు అవకాశము కలదు. తెలంగాణా ప్రాంతములో మహబూబునగర్ జిల్లాయందు ఈజాతివారు ఎక్కువ కలరు. రాష్ట్రగిరిజన సంక్షేమ శాఖవారు గతేక సంవత్సర

ములనుండి చర్య జరుపుతున్నారు. కాని ఇంతవరకు ఎటువంటి అభివృద్ధికి తోడ్పడలేదు.

దేశములో నూటికి తొంభై శాతము దరిద్రనారాయణులతో నిండియున్నది. కావున స్వచ్ఛంద సంస్థలు, వాలంటరీ యాజమాన్య సంస్థలు, ముందుకు వచ్చి వీరి ఆర్థిక, స్థితిగతులు మెఱుగు పరచవలెను. సంఘసేవకులు వీరి దగ్గరకు వెళ్ళి, వారితో ఐకమత్యము, నాగరికత, విద్య, వైద్య సౌకర్యముల గురించి ప్రబోధించి, ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చి సాయపడవలసినదిగా మనవి.

## లంబాడీవారు (సుగాలి)

భగవంతుని విచిత్రమైన సృష్టిలో మానవజాతి అత్యంత ముఖ్యమైనది. వీరిలో లంబాడీవారు ఆదిమజాతులుగా పరిగణింపబడిరి. వీరిని గురించి చరిత్రకారులు విభిన్న రకములైన అభిప్రాయములను వెల్లడించుచున్నారు. 326 బి.సి. లో అలెగ్జాండరు దండయాత్ర చేసినపుడని కొందరు తెలుపుచున్నారు. వీరిలో కొందరు చైనానుండి ఉత్తరహిందూస్థాన్ మీదుగా ఇండియాకు వలసవచ్చినారని వీరిలో కొందరి అభిప్రాయము. వీరు ఆర్యుల కాలములోనివారనియు, పసిఫిక్ మహాసముద్రము దాటి వింధ్యపర్వతము వద్ద నివసించినారనియు, చెప్పుట వాడుకలో యున్నది. వీరిలో చాలమంది ఆ కాలములో యుద్ధాలు

చేసెడివారు. కొన్ని వేలమంది చనిపోయినారు అని వాడుకలో యున్నది. ఆ రోజులలో రాజుల ఆస్థానములలో, బ్రిటీషు వారి పాలనలో, రచయితలగను, కవులగాను, లాయర్లగను, విద్వాంసులుగాను, వ్యాపారస్తులుగాను యుండెడివారు. 17వ శతాబ్దములోని కొందరు అధికారులు బంజారీలు, గెరిల్లాలు, వీరివలన జాతికి నష్టము కల్గుచున్నది, వీరిని కాల్చివేయండి, అని ఉత్తర్వులు వాడుకలో యుండెడివి. ఆ సమయములో లక్షలమంది బంజారీలను ఓడలపైన బలవంతముగా ఎక్కించి, ఉత్తరఅమెరికాకు, దక్షిణఅమెరికాకు, ఫసిఫిక్ దీవులకు నీగ్రోలుగా వలసపంపి యున్నారు. అరబ్ గల్ఫ దేశాలలో షుగాళీల పిల్లలను బలవంతముగా ఎత్తుకొనివెళ్ళి క్రైస్తవుల క్రిందమారిన మనుషులు వేలసంఖ్యలో కలరు. కొన్ని వేలమంది స్త్రీలను మానభంగాలు చేసినారుఅని చరిత్రకారుల అభిప్రాయము. కారణము వీరిస్త్రీలు అందముగా యుందురు. బజారునృత్యము చేయుదురు. వీరిలోస్త్రీలు నల్గురుగాని, పదకొండుమందిగాని, పదహారుమందిగాని, జట్లుజట్లుగా కూర్చొని వలయాకారముగా నృత్యము చేయుట అతిముఖ్యమైనది. వీరుధరించు ఏనుగు దంతపు గాజులు గజ్జలు ఘనఘనమని మ్రోతయిచ్చును. తప్పెట్లతో మగవారు నృత్యము చేస్తుందురు. ప్రేక్షకులు గంటలకొలది వీరి నృత్యములు తిలకించేవారు. వీరి భాషకు లిపి లేదు. వీరికి బ్యాండు వాద్యములు, తప్పెట్లు, డప్పులు, మృదంగము కలవు. వీరు పిటిని గ్రామము

లందు వాయించుచునూ, పాటకచ్చేరీలు చేయుచును, జీవికనూటు ముఖ్యవృత్తి. వీరిలో వ్యభిచారము లేదు. కాని అగ్రకులాల వారు వీరిపై లేనిపోనివాదులుకూర్చి సమాజములో పతిత లుగా చేయించిన కారణములు అనేకములు కలవు. 12వశతా బ్దానికి పూర్వము బంజారిస్త్రీలను కన్యలను పెండ్లి చేసు కొన్నట్లు ఆనాటి వనితలు ఇప్పుడు 20శాతము వరకు ఉన్న ట్లుగా చరిత్రలో వ్రాయబడినది. వీరికి విగ్రహములను పూజించుట, దైవసన్నిధిన నాట్యప్రదర్శనలు ఇచ్చుట, [illegible] సంఘు కట్టుబాట్లయందు మద్యము సేవించుట, పండుగల సమయములందు వరుసకు అయిన వారిని ఏడిపించుట, వ్యాపార ప్రయాణము చేసి, కొన్ని సంవత్సరముల తర్వాత కలుసు కొన్న రోజుల ఏడ్చుట, మొదలగు విషయములు వీరి నాగరి కతను చాటుచున్నవి, బంజారీలు ఇండియాలో, రాజస్థాన్, ఒరిస్సా, మహారాష్ట్ర, త్రిపుర, మేఘాలయ, గుజరాత్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. దేశము మొత్తం మీద మహారాష్ట్రలో యున్నారు. వీరిలో శ్రీ యు. సి. నాయక్ మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా 18 సంవత్సరములు పనిచేసినారు. రాష్ట్రములో శాసన సభ్యులు గాను, పార్లమెంటు సభ్యులుగాను, మంత్రిపదవులు ఎంతో మంది అలంకరించిరి. అందువలన అగ్ర[illegible]కము, మహా రాష్ట్రకే చెందుతుంది.

వ్యవసాయము : వీరిలో నూటికి 50% వ్యవసాయము చేయుదురు. అడవిప్రాంతముల యందును, గ్రామాలశివార్ల యందు, లంకపొలముల యందు, పాలెట్టు బంజరు భూములను సాగుచేసుకొని జీవించుట వీరి అలవాటు. వీరిలో చాలామంది భూస్వాముల ఇండ్లయందు జీతములకు కుదురుదురు. వీరు ఆధునాతన వ్యవసాయ పరికరముల ద్వారా భూమిని సస్యశ్యామలము చేసి వ్యవసాయము చేసుకొందురు.

పంటలు : వీరు జొన్న, సజ్జ, వరిగ, మొక్కజొన్న, రాగులు, మిర్చి, ప్రత్తి మొదలగు పంటలు పండించెడివారు. నూతన వ్యవసాయపద్ధతులను అవలంబించుచుండుట వలన, రిజరువాయిర్ల ద్వారాను, కాలువలద్వారాను, నీటిని పెట్టి సాలుకు రెండుపంటలు పండించుచున్నారు. వీరు ముఖ్యముగా చిలగడదుంపలు, ఉల్లగడ్డలు పండింతురు.

గృహములు : వీరు గృహములను అవిఉండు ప్రదేశముల గురించి ప్రత్యేకశ్రద్ధ వహించెదరు. వీరిలో 15 కుటుంబములనుండి 100 కుటుంబముల వరకు దశరలవారీగా, జట్లుగా వెళ్ళుచు పలుప్రాంతములలో డేరాలు నిర్మించుకొంటారు. వీరు మొదట బాలాజీ స్వామి పేరున ఒక యిల్లు కడతారు. స్వామికి నైవేద్యము, పొంగలి చల్లించి మిగతా ఇండ్లను కట్టుకుంటారు. పూర్వము అడవిప్రాంతముల యందు, కొండ చరియలయందు, పచ్చికమైదానముల యందు, ఏడారి తీర

ప్రాంతములయందు త్రికోణ ఆకారపు ఇండ్లను ఇటుకలతో నిర్మించుకొనెడివారు. గత 20 సంవత్సరములనుండి గ్రామ ప్రాంతముల యందు, గవర్నమెంటువారి ఆర్థిక సహాకారముతో సంసారగృహములు నిర్మించుకొని కాపురములు చేసుకొనుచున్నారు.

ఆభరణములు :— వీరు వెండి బంగారు, ఏనుగుదంతపు నగలను ధరించెడివారు. పెండ్లి సమయములందు నూటఏదవారు రూపాయలనుండి 300 రూపాయల వరకు పెండ్లికూతురికి ఓలిగా చెల్లించి సప్పాదు అంటే మొత్తమును, ఆసొమ్ములను చెల్లించవలయును. అట్లు చెల్లించని యెడల ఆరుమాసాలవరకు గడువుపెట్టి బలవంతముగా కట్టించెదరు. వీరు నృత్య, నాటక సమయములందు గజ్జెలు, ఏనుగుదంతపు గాజులు వాడుదురు.

పండుగలు :— బంజారులకు హోలీపండుగయన్న ముఖ్యఇష్టము. బంజారీ స్త్రీలు వీధుల వెంట నృత్యము చేసుకొంటు డబ్బులనుఅడుక్కొంటారు. విచిత్రవేషములు బుఱ్ఱకథలు, మగవారు విల్లసంబులుధరించి, నృత్యము చేయుదురు. వీరు విజయదశిమి, సంక్రాంతి పండుగలు, బాలాజీ స్వామి రథఉత్సవము జరుపుకొందురు.

ఆర్థిక జీవితము :- బంజారీలలో ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణాలో ఎక్కువ మంది కలరు. వీరిలో ఇండ్లు కట్టుట, రోడ్లువేయుట, తాళ్ళు, నారపేనుట, నూలు వడకుట, కంకర,

తారు మొదలగు పనులు చేయుట వీరికిఅలవాటు. వీరు ప్రతి దినము రాయిని పగల గొట్టి శ్రమించి జీవింతురు. వీరిలో కల్లు, సారాయి అమ్ముదురు. కొందరు తాటి చెట్లనుండి, ఈత చెట్లనుండి గూడా కల్లును గీయుదురు. కొందరు పండ్లు, కూరగాయలు, అమ్ముదురు. మరికొంత మంది ఖాయిదా బేరముచేసి జీవింతురు.

వివాహములు :- వీరు వివాహ సమయములందు హిందూ ధర్మ, ఆచార వ్యవహారములను ఆచరించెడివారు. వివాహముహూర్తము రోజులలో ఆదివారముగాని, బుధ వారముగాని, పెండ్లికొడుకు ఇంటివద్ద పెండ్లికుమారుని చేసి, అభ్యంగన స్నానము చేయుదురు. అక్కలు, చెల్లెండ్రు హారతులు పట్టెదరు. బంధుమిత్రులకు, చుట్టములకు, ఇటువంటి వారికి భోజనములు పెట్టెదరు. పెండ్లికుమారునికి కానుకలు, వస్త్రములు అదేరోజున బంధువులు పెట్టెదరు. పెండ్లికి ముందు ప్రథాసము పెట్టు సమయమునందున, ఇరు వైపుల నాయకులు తండాలోనె కూర్చొని 3 ఎత్తుల బెల్లము, 10 లీటర్ల సారాయి తెప్పించి, అందరికి పంచిపెట్టి కులఆచార వ్యవహారము ప్రకారము సాగిస్తూ సాయి తండా పెద్దనాయకుడు అందరికి చేతిమార్పుడు చేయును. ఆరోజు నుండి పెండ్లికూతురు, పెండ్లికుమారునకు భార్యగా పెద్దగా కట్టుబాటు చేసెదరు. పెండ్లికూతురుకుమారుడు, వారి పరివారము

అర్ధరాత్రి 12 సమయమునందు పెండ్లికుమార్తె గ్రామము నకు వెళ్ళి 4 ఫర్లాంగుల దూరములో విడిది చేస్తారు. ఒక జాతి మనుష్యులను పెండ్లికుమార్తె ఇంటికి కబురు పంపెదరు. కొన్ని కుశల ప్రశ్నలు ఇరుపక్షమువారు వేసుకొంటారు. ఆనందభరితము కౌగలించుకొనెదరు. పెండ్లివారికి భోజన ములు ఒక ఎద్దుల బండిలో తీసుకొని పోయి వారికి పెట్టెదరు. బంధుమిత్రులు, పెండ్లికుమారుని ఆలింగనము చేసుకొని ఏడుస్తారు. పురాణాలలో, ఇతిహాసములలో కథలనుబట్టి వీరికి ఈడ్పు వాయిద్యములు గాగి దేవతలను పూజిస్తారు. పెండ్లి కుమార్తె ఇంటివద్ద తన స్నేహితురాండ్రతో ఏడ్చుచు కూర్చొని యుండును. పెండ్లికుమారుని వారిపరివారమును ఈతచాపల మీద కూర్చుండ బెడుదురు. పెద్దలు, పెండ్లి కుమారునికి, పెండ్లి కుమార్తెకూ, ఇరు వైపుల ఐదుగురు పెండ్లికాని ఆడు పిల్లలను, మరి ఐదుగురు పెండ్లికాని మగ వారిని పిల్లలను కూర్చుండ బెట్టుదురు. పెండ్లి కుమార్తె, పెండ్లికుమారునకు అన్నము, బెల్లము, నేయి వేసి నాయకులు తిని పిస్తారు. ఆరోజు నుండి మూడు మాసముల వరకు పెండ్లి కుమారుడు, పెండ్లి కుమార్తె ఇంటి వద్ద చాపపై పడుకొవ వలెను. తెల్లవారు ఝామున కోడి కూయకముందే కాల కృత్యములను తీర్చుకొనవలయును. బయటకి ఎచ్చటికైనా వెళ్ళేటప్పుడు అత్తయ్య గారికి చెప్పి వెళ్ళవలయును. పెండ్లి కుమారుడు కంటే పెద్దవారు ఎవరినైన 100 గజముల

లోపు చూస్తే మర్యాద కొరకు నించొనవలెను. పెండ్లి వారము రోజులు ఉండనగా ముందు మర్యాద పూర్వకముగా లగ్న ముహూర్తం పెట్టుకుంటారు. ఆ రోజున ఇరు వైపున పెండ్లి వారు "ఘోటా" పండుగ చేసెదరు. ఆ రోజున ఒక పిడత తీసికొని ఎండుకొబ్బరి, బెల్లము నానబెట్టుకొని, ప్రొద్దున తింటారు. పెండ్లి కుమార్తెకు ముసలివారు వారి అనుభవములను గూర్చి బోధిస్తారు. ఆ రాత్రి అంతయు తప్పెట్లతోను, నాట్యముతోను, కాలము కుషీగా గడుపుతారు. తెల్లవారు ఝామున 5 గంటలకు పెండ్లి కుమార్తె ఇంటివద్ద బంతి పెడ్తారు. పెండ్లి కుమారునితో వివిధ తండా నాయకులకూ గ్రామ పెద్దలకు బెల్లము పానకము అరటి ఆకు లోటాగా చేసి పోయిస్తారు. పెండ్లికుమార్తెకు వారి దరవు బంధువులు చదివింపులు చదివిస్తారు. వారము రోజులు తర్వాత తండా నాయకుల వద్దకు వెళ్ళి ముహూర్తము నిర్ణయించుకొని పెండ్లికుమార్తె యింటివద్ద పెండ్లి ఘనంగా చేస్తారు.

తరువాత 15 దినముల తర్వాత చుట్టు ప్రక్కల ప్రాంతములలోని తండా నాయకులు కూర్చుని "ఝూంట్," అనే పండుగ చేస్తారు. ఆరోజున షుమారు పది, పన్రెండు మేకలను బలియిస్తారు. తర్వాత మాంసము అన్నము కల్లుతో కలుపుకొని భుజిస్తారు. ఆరోజుననే పెండ్లికుమార్తెకు బందురా బద్దులు, పంతపు గాజులు తొడుగుతారు.

ఆ మరుసటి దినము పెండ్లి వారు అందరు 14 బంటి ఎద్దుబండ్లతో పెండ్లికుమారుని ఇంటికి వెడతారు. పెద్దలు సుముహూర్తము నిర్ణయించి కార్యము చేస్తారు. తర్వాత వారము రోజుల తర్వాత భార్యాభర్తలు తమ ఇష్టమైన దైవమునకు పూజలు చేస్తారు. ఈవిధముగా 16 వారములు బంజారా కుటుంబములో పెండ్లి చేస్తారు. ఇది చాలా చారిత్రాత్మకమైనది.

<u>పెంపుడు జంతువులు</u> : వీరు ఆవులను, గొర్రెలను, మేకలను, ఒంటెలను, నెమళ్ళను, జింకలను పెంచెడివారు. ఆవులు, మేకలు, మందలు మందలుగా వివిధ గ్రామము లకు తోలుకొనిపోయి, రైతుల భూములకు తోలుతారు. కోళ్ళు, పావురాళ్ళు, నెమళ్ళు మొదలగు పక్షులను పెంచుట వీరికి అలవాటు.

<u>వేట</u> : వీరు పగలు కూలీ పనిచేస్తారు. రాత్రిళ్ళు 10 గంటలవరకు భజనలు చేసి వలలు చేపట్టి 5 బ్యాటరీలు టార్చి లైట్లు తుపాకీ తీసుకొని అడవి ప్రాంతములయందు, కొలకల యందు, పొంచి యుండే కుందేళ్ళు, జింకలు, అడవి పందిపిల్లలు కోయిలలు మొదలగు వాటిని కాల్చి తీసుకొని వెళ్ళి అమ్ముకుంటారు. వీరికి ఎండాకాలము నాలుగు మాసములు మంచిసమయము.

<u>ఆహారపు అలవాట్లు</u> :- వీరు సంచార ప్రవృత్తిననుసరించియే ఆధారపడియుందురు. "రేపు" అనే ఆలోచన వీరికి లేదు గనుక వీరికి తినుటకు అనువగునది దొరికినప్పుడల్లా తినినంత తిని పారవేయుటయే వీరి అలవాటు. వీరిలో నూటికి 80 మంది మాంసాహారపదార్థములను భుజించెదరు. వీరిలో కొంతమంది వేటాడిన జంతువుల మాంసమును ఎండబెట్టుకొని తినుట అలవాటై యున్నది. వీరు పక్షులను, అడవి పక్షులు, అడవి పావురాళ్ళను కూడ తినెదరు.

<u>వైద్య విజ్ఞానము</u> :- వీరిలో చాలామంది అడవులలో తిరుగుతూంటారు. కనుక వీరికి దెబ్బలు తగిలినను, కడుపులో నొప్పివచ్చినను, తలకాయ నొప్పివచ్చినను, యితర దీర్ఘకాలమైన వ్యాధులు సంభవించినను, అడవిఔషధములు, చెట్లక్రియలు వాడుదురు.

<u>సంగీత నాట్యములు</u> :- వీరు ఎంతో అందంగా ఉంటారు. వీరి కంఠమాధుర్యము ఎంత బాగుంటుందో అంత శ్రావ్యంగా పాడగలరు. వీరు గ్రామములోను, పండుగల సమయములందు బంజారా నృత్యములు, చేయుచు నాట్యము చేయుదురు. కొన్ని వేలమంది ప్రజలను ఆనందపు డోలికలలో ముంచివేయుదురు.

<u>భాషలు</u> :- గిరిజన తెగలలో అనేకమైన భాషలు ఆఫ్రికలో ఉన్న, పాశ్చాత్య దేశాలలో నివసించు గిరి

జనులలో ఒక్కొక్క జాతికి ఒక్కొక్క భాషకలదు. మన రాష్ట్రంలో ఎఱుకల లంబాడివారికి మాత్రం భాషలు 8 కలవు. భాషకు కొంత తెలుగు, తురకము కలియును. మరియును రాజస్థాన్ భాషకు వీరికి తగుపోలికకలదు.

కుటీర పరిశ్రమలు :- గిరిజనజాతులలో ఈకు, కలప, గొర్రెలు, పశువులు కూరగాయలు—కోళ్ళు పెంచుట, పాడి పరిశ్రమ, పండ్ల పెంపకము మొదలగునవి వాడుకలో యున్నవి.

## కరంబలు

వీరు ఆంధ్రరాష్ట్రములో రాయలసీమ ప్రాంతములో నివసించెదరు, వీరిని కడప, చిత్తూరు, తిరుపతి అనంతపురము మొదలగు ప్రాంతములలో తరచు చూస్తాము. వీరు గొల్లజాతి వారితో సమానముగ ఉందురు. కారణము వారి భాష యూనగానుండును. కట్టు, బొట్టు, గుడ్డ, వారి నేలనుసరింతురు. వీరిలో "కరము" అనే పెద్ద నాయకుడుగా యుండును. వీరు పశువులు మేకలు, పెంచుట ముఖ్యవృత్తి. వీరు పశువులను, మేకలను కసాయి దుకాణములకు తీసుకొని వెళ్ళి అమ్మెదురు. వీరు చిత్తూరు జిల్లాలో క్రమక్రమముంగా స్థిరనివాసం ఏర్పరచుకొని వ్యవసాయముచేసి జీవించుచున్నారు.

మతము :- వీరు హిందువుల మాదిరి, నిలువుబొట్టు, కట్టువస్త్రములు ధరిస్తారు. శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి

వారిని ఆరాధ్యదైవముగా కొలుస్తారు. వీరికి ఉగాది పండుగ అత్యంత ముఖ్యమైనది. ఇరాణు కుటుంబ సభ్యులు ఎక్కడ ఉన్నానరి అందరూ ఒకచోట చేరి నృత్యనాటకములతో, జానపదగేయాలతో కాలము గడుపుతారు.

పంటలు :- వీరు రాగులు, ఆరెకలు, జొన్నలు, తైదలు పండించెదరు. వీరు ప్రొద్దుననే రాగి అంబలి మూడు ముద్దలు మజ్జిగతోగాని, పుల్లనీళ్ళతోగాని తింటారు. కలువు కారములో మధ్యానము భోజనము చేయుట వీరికి అలవాటు.

శిశుహత్యలు :- వీరిలో శిశుహత్యాచారం యుండెడిది. ఇది చాలా పాపము. ఆడపిల్లలను పుట్టితే, పుట్టినప్పుడే చంపివేయుట వీరికి అలవాటు. మగశిశువు పుడితే వీరు ఉల్లాసంగా పండుగచేసుకొంటారు. వీరు సంచారులు కనుక ఎక్కువ సంతానము వెంట ఉంచుకొనక, చంపెడివారు. వీరి ఆచార వ్యవహారములు "కంసుడు-దేవకి" కథలు మాదిరిగా ఉంటాయి. ఒరిస్సారాష్ట్రములో 1941లో ఈజాతి వారిపై ప్రభుత్వం ఆంక్షలు విధించింది. దాంతో శిశుహత్యలు కొంతవరకు తగ్గినవి.

పురుషులకు ఉన్నత స్థానము :- వీరిలో పురుషులకు ఉన్నతస్థానము కలదు. వీరు భజనలు, జానపదనృత్యములు చేయుట వీరికి అలవాటు. పండుగ సమయములందు హరిదాసులను పోలిన వేషమును వేయుదురు. కుటుంబమునకు

పురుషుడు పెద్ద. ఆపురుషుడు ఒక్కడే కష్టపడి పనిచేయును. మిగతా కుటుంబ సభ్యులు ఇంటియందే ఉంటారు.

నిజాయితీ :- వీరు ఏమాట చెప్పినను, దానిని ఆచరించుట వారికి అలవాటు. అసత్యము ఆడుట వారికి గొడ్డలిపెట్టు. రైతుల ఇండ్లయందు జీతమునకు పనిచేసినను, రైతుల వ్యవసాయము, పంటలు భారము వీరిపై ఉంచుతారు.

## నాగాలు (నాగాలాండ్)

నాగాలాండ్ రాష్ట్రములో ప్రధాన భాగమైన నాగా హిల్స్ జిల్లా పుట్టుక 1866 లోనే జరిగినది. అటు నాగాలాండ్ అధికారపక్షమైన యునైటెడ్ డెమొక్రెటిక్ ఫ్రంట్ పక్ష అధ్యక్షులు శ్రీ టి. అలీబా ఇమ్ సుదీర్ఘ లేఖలో కేంద్ర ప్రభుత్వమునకు సమస్య పూర్వాపరాలను వివరంగా వివరించారు. బ్రిటీష్ వారు యుద్ధము చేస్తుంటూ, నాగా ప్రాంతము వరకు చొచ్చుకు వచ్చినపుడు సౌకర్యం కోసం అస్సాం భాగము నుంచి కొంత భాగము వేరుచేసి నాగాహిల్స్ జిల్లాను ఏర్పాటు చేసినారు. ఆ ప్రకారంగా 1867 లో దీన్ని హేతుబద్ధంగా సవరిస్తూ క్రొత్త నోటిఫికేషను జారీ చేయబడింది. నా హిల్స్ ప్రాంతము అస్సాంలోని మైదానాలకు ప్రక్కనేయున్నది. ఆ తర్వాత 1889 ప్రాంతంలో అస్సాం, బెంగాల్ రైల్వే మార్గం ఏర్పడింది. ఇలాగే మరెన్నో ప్రాంతాల వారు స్వాధీనము చేసుకొంటూ రావడం, అస్తవ్యస్తపాలనల ఫలితంగా

నాగా ప్రాంతంకూడా నుంచి పరిపాలనావిధానానికి నోచుకో లేకపోయింది. దానికి తోడు నాగాల్తో, మరికొన్ని ప్రాంతా లను 1901, 1903, 1920 సంవత్సరాలలో అస్సాంలోని మరి కొన్ని జిల్లాలతో కలిపివేశారు.

దారుణం ఏమిటంటే ఈ బదలాయింపులకు నాగా ప్రజల అనుమతిమాట అలా ఉంచి, అసలు వారికి సంగతి తెలియదు ఇదంతా చాలదన్నట్లు నాగా ప్రాంతములో తేయాకు తోటలు ఏర్పాటుచేయడం, ఆతర్వాత ఆతోటలను అస్సాంలో కలిపివేయడం ఫలితంగా నాగా ప్రాంతము చిన్న దై పోసాగింది.

నిజానికి నాగాహిల్స్ జిల్లాను షెడ్యూల్డ్ జిల్లాగా ప్రకటిస్తూ 1874లో చట్టం రూపొందింది. ఆతర్వాత 1937లో ఆచట్టము రద్దయింది. తర్వాత 1919లో భారత ప్రభుత్వచట్టం ఈ ప్రాంతాన్ని వెనుకబడిన ప్రాంతముగా గుర్తించింది. కాని 1935లో వచ్చిన మరోచట్టం (ఇదీ భారత ప్రభుత్వందే) ఈప్రాంతాన్ని మినహాయింపు పొందిన ప్రాంతముగా మార్చింది. ఆతర్వాత 1950-1957 లలో ఈ ప్రాంతాన్ని రాజ్యాంగచట్టాలు పరిధిలోనికి తెచ్చి 1963లో ప్రత్యేక రాష్ట్రపతిని (నాగాలాండ్ రాష్ట్రచట్టం- 1962) లో కల్పించారు. అప్పుడు ఇందులో ట్యుయెన్సాగ్ ప్రాంతము కూడా మిళితమైయున్నది.

నిజానికి ఈ నాగా ప్రాంతము అంతా తేయాకు తోటలకు చాలా అనువైన ప్రాంతముగా యుండేది. ఈ ప్రాంత ఆహోములకు, నాగాలకు మధ్య కుదిరిన సరిహద్దు ఒప్పందం మేరకు నాగా ప్రాంతముగా వుండి, ఆ ఒప్పందము కాలగతిలో, నాగాలకూ, బ్రిటీషు ఇండియా ప్రభుత్వానికి కుదిరిన ఒప్పందముగా మారింది. అప్పట్లో డోయింగ్ నది, శివసాగర్ జిల్లా వగైరాలు నాగాలోనే యుండేవి. ఆతర్వాత క్రమక్రమంగా అస్సాంలో కలిసిపోయినవి.

అసలు సమస్య వెనుక ఇంతగా; ఉండనే ఇప్పటికైనా నాగాంగ్, శివసాగర్ తదితర ప్రాంతాలను తిరిగి నాగాలాండ్ కు అప్పగించాలని, నాగాలాండ్ ప్రజలు పట్టుబడుతున్నారు, అని శ్రీ. అలీభా తన లేఖలో భారత ప్రధాని శ్రీ మురార్జి దేశాయికి తెలియచేశారు.

అదియునుగాక శ్రీ బి. అలీభా ఈ వేరుకు జనతాపార్టీ కార్యదర్శులు శ్రీ మధులిమయే, నానాజీ, దేశముఖ్ లకు విడివిడిగా లేఖలు వ్రాసినారు.

సుమారు రెండుదశాబ్దాల క్రిందట 1960 లో అప్పటి భారత ప్రభుత్వానికి, నాగా ప్రభుత్వానికి, నాగా ప్రజనిధి వర్గానికి మధ్యకుదిరిన 16 సూత్రాల ఒప్పందం ప్రకారం ఈనాడు తమకు లభ్యమయిన అరణ్యప్రాంతాలన్నింటిని ఇప్పుడు తిరిగి అప్పచెప్పాలని, నాగాలాండ్ ప్రజలు తిరిగి

గట్టిపట్టుదలపడుతున్నారు. అస్సాం రాష్ట్రానికి, నాగాలాండ్‌కు మధ్య ఖచ్చితమైన న్యాయసమ్మతమైన సరిహద్దు ఏర్పడాలన్నదే నాగా ప్రజల చిరకాలవాంఛయని శ్రీ అలీభా తనలేఖలో స్పష్టంచేశారు.

సంవత్సరాల తరబడి, హింసాదౌర్జన్యాలవలన కలిగే దుష్ఫలితాలను చవిచూచి నాగా ప్రజలిప్పుడు శాంతి అనే కాంతతో ఉరకలు వేస్తున్నట్లుగా పేర్కొన్నారు. రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి శాంతియుత వాతావరణము పెంపొందాలనేదే వారి ధ్యేయము అని తెలిపారు.

అయితే సరిహద్దు విషయములో ఏలాంటి అన్యాయాన్ని కల్పించినా వారు సహించే స్థితిలో లేరని, స్పష్టంచేస్తూ, దశాబ్దలతరబడి హింసా, రక్తపాతాల వాతావరణంలో మ్రగ్గిన వారు పరిస్థితులను బట్టి రెచ్చగొడితే, మళ్ళ హింసకు దిగటం సమంజసం అవకతప్పదు అని శ్రీ అలీభా వివరించారు.

భారత రాజ్యాంగం ప్రకారం రెండు రాష్ట్రాల మధ్య సరిహద్దు వివాదం వస్తే, అది ఆ రాష్ట్రాలకు సంబంధించినది మాత్రమే అవుతుంది. కాని నాగా విషయాన్ని మాత్రం ప్రత్యేక శ్రద్ధతో పరిగణించవలసి యుంటుందని హెచ్చరించారు.

నాగాలకు స్వతంత్రములు రాకముందు నుంచి కూడా అన్యాయము జరుగుతున్నదని వారి వాదన. ఈ అన్యాయము అరికట్టడానికి పొరుగు రాష్ట్రాలు శాసించే నైతిక హక్కు కేంద్ర ప్రభుత్వానికే ఉందని నాగా అధికార ప్రంట్ నాయకుడు అభిప్రాయ పడ్డాడు.

పరిస్థితుల కాల గర్భమున కలిసిపోయినా, ఎన్ని విపత్పరియాలు అవతరించినా, రాజకీయ పరిస్థితులు మారినా, రక్తపాతాలు జరిగినా, ప్రాథంచిక విలువలు మారినా, "ఇచ్చి పుచ్చుకొన్నా ధోరణిలో సరిహద్దు సమస్యా పరిష్కారార్థం అస్సాంలో చర్యలు జరుకటానికి నాగా ప్రభుత్వం, యునైటెడ్ ఫ్రంట్ పార్టీ, రెండు ప్రక్కలనే ఉన్నాము. శ్రీ అలీభా తనలేఖలో కేంద్ర ప్రభుత్వ అధికారులకు, జనతా పార్టీ కార్యదర్శులకు, భారత రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి గార్కి లేఖలు పంపుట శోచనీయము.

వీరి ఆచార వ్యవహారములు :- నాగాలు 5 అడుగుల 8 అంగుళముల పొడవు ఉంటారు. పరిస్థితులనుబట్టి వారి జీవన ప్రమాణము ఆధారపడియున్నది. వీరిలో స్త్రీలకు ప్రత్యేకమైన గౌరవము యిస్తారు. స్త్రీని దేవతగా పూజిస్తారు. స్త్రీ హత్య, గోహత్య, శిశు హత్యలను బహిష్కరిస్తారు. వీరు దేవుని ప్రతి శుక్రవారము పూజిస్తారు. అన్ని పంచితముతో ఇండ్లయందు శుద్ధిచేస్తారు. ఆవు పేడతో ఇండ్లను శుభ్రముగా అలుకుతారు. అందువలన

దరిద్ర్యము, క్షామము మొదలగునవి రావని వీరి భావన. వీరు నాగేంద్రస్వామిని అమితంగా పూజిస్తారు. శనివారం నాడు తులసి చెట్టును యింటింటా నాటుదురు. ప్రతిదినము స్త్రీలు వేకువ ఝామున లేచి అభ్యంగన స్నానము చేసి, భర్తల ఆశీర్వాదములు తీసుకొనుదురు. వీరిలో విశిష్టమైన కళగలదు. అదియే శిల్పకళ. పూర్వము మహాబలిపురము, అజంతా, ఎల్లోరా గుహాలలో చిత్రములు, కట్టడములు వీరు చేసినారు అను ఒక వార్త వాడుకలో యున్నది. ప్రాచీన ఆచార్యుడు శ్రీ నాగార్జునునివద్ద శిష్యరికము చేసి నారని వార్త కలదు.

పంటలు :- వీరు మొక్కజొన్న, తేయాకు తోటలు విరివిగా పెంచెదరు. వీరిలో మగవారు వ్యవసాయము చేస్తారు. 10 సంవత్సరముల నుండి 2[illegible] సంవత్సరముల వయస్సు మగవారు, ఆడవారు వ్యవసాయమునకు సాయపడతారు.

కేంద్ర ప్రభుత్వము తీసుకొనవలసిన చర్య :- ఇండియాకు స్వరాజ్యం వచ్చి 32 సం॥లు అయినా, గిరిజనుల యెడల కేంద్ర ప్రభుత్వం సవతి ప్రేమచూపుచున్నది. మాజీ ప్రధానులు శ్రీ పండిట్ జవహార్ లాల్ నెహ్రూ, శ్రీమతి ఇందిరాగాంధీ గార్ల 29 సం॥ పరిపాలనలో కుప్ప త్రియ్య [illegible] నాగాల, [illegible] నిర్లక్ష్యము

తీసుకొనక గిరిజన జాతికి హానిచేశారు. అదియునుగాక నాగాలు నిరక్షరాశ్యులు గనుక, వారి విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనలేక పోవడం ఘోరమైన అన్యాయం జరిగి పోయింది.

ప్రస్తుత జనతా కేంద్ర ప్రభుత్వం వారి పరిస్థితులను అర్థంచేసుకొని అస్సాం, నాగాలాండ్ సరిహద్దు సమస్యను త్వరలో పరిష్కారంచేసి, వారి ఆర్థిక పరిస్థితికిగాను, ప్రణాళికల ఏర్పాటుగావించి, గిరిజన సంక్షేమ శాఖ, హోం శాఖలు సంయుక్తముగా పనిచేయ గల్గితే, వారు కోరుకొన్న రామరాజ్యం కావటానికి పెద్దమార్పు ఏమియులేదు. "కష్టే ఫలి" అన్నారు పెద్దలు. నాగాలు దినమునకు 18 గంటలు కష్టపడి పనిజేస్తారు. కాబట్టి ఎటువంటి కార్యములను అయినను శ్రద్ధతో, ఓపికతో సహనముతో ఇన్ని ఏండ్లుగడిపారు.

కావున కేంద్ర ప్రభుత్వముపై విషయములను పరిగణలోనికి తీసుకొని న్యాయంజేకూర్చ గలందులకు మనవి :—

## వాల్మీకులు — వారి అభివృద్ధి

ఆంధ్రప్రదేశ్ గిరిజన అభ్యుదయంతో గిరిజనుల జీవన ప్రమాణాలను, వారి ప్రవృత్తులను, పరిశీలించేటప్పుడు కొద్దిమందిగా యుండి, పెద్దల దృష్టిని ఆకర్షించు కొనలేక గిరిజన అభ్యుదయంలో ఫలితం కాలేక వేరుగా చిన్న మాన్పు

చూడబడుచున్న కొంతమంది గిరిజనుల పరిస్థితులను పరిశీలించ వలసిన విషయం ఎంతో ఉంది. అట్టివారిలో చెప్పుకో తగినంత సంఖ్యలో యుండి గుర్తింపబడని వారిలో ఒకరైన "బోయ" కులస్థులను వారి స్థితి గతులను వివరించటానికి ప్రయత్నిస్తాను.

బోయలు—వారి పుట్టుక :- బోయలు వారి పుట్టుకను గూర్చి పరిశీలన ప్రారంభించినపుడు గ్రంధస్తము కాని విషయములు ఆధారముగానే వారి పుట్టుకను గూర్చి మనము ఒక నిర్ధారణకు రావలసియుండును. ఎందుచేతనంటే వారిని గురించి ఏ గ్రంధములోను ఎక్కడ ఏ విధమైన వ్రాతలు మనకు దొరకవు. అందుచేత బోయయొక్క కట్టు, బొట్టు తీరు తెన్ను — పరిశీలన మీద ఏ రాష్ట్రములో మిగిలిన గిరిజనుల జీవన పరిస్థితులను పరిశీలించి వారికి వీరికి ఉన్న సామీప్యతలు ఆధారముగా మనము వారి పుట్టుకపై నిర్ణయాలను చేయవలసి యున్నది. నేను వ్రాసే వివరణలు కావలయునని పరిశీలనల మీదనే వ్రాయుచున్నాను. అందుచేత చదువరులు, ఇంకను పరిశీలన జరిపి, భవిష్యత్తులో అగమ్యగోచరముగా యుండి, కొంత వెలుగులోకి రాబడ్డ వీరి పుట్టుకపై పరిశీలన జరుపవలసిన అవసరము, ఎంతైనా గమనించి వ్యవహరిస్తారని ఆశిస్తాను.

రామాయణ కర్త వాల్మీకి సంతతి వారే వీరనేది పురాణ ప్రసిద్ధము. అందుచేత బోయలుగా పిలువ బడే

వీరు అడవులలో స్థిరనివాసము ఏర్పరచుకొని పశుపక్ష్యాదులను వధించి వాటిని ఆహారముగా తీసుకొన్న వారు కాబట్టే, వీరికి బోయలని, పుట్టలపై మొలయుగొడుగులను అనగా పుట్టగొడుగులను ఆహారముగా తీసుకొనుచూ, పాములను పూజించుతూ, జీవన యాత్ర సాగించినవారు గావున వీరికి మరొక పేరు వాల్మీకులనియు నామకరణము జరిగి యుండవచ్చు. ఏది ఏమైనా వీరు ఆది భారత సంతతికి చెందినవారే యని నిర్వివాదాంశము.

<u>జీవితవిధానము</u> :- బోయల యొక్క జీవన విధానమును పరిశీలించినవారు మిశ్రమ ఆహారులుగానే పిలువబడు తారు. ఎందుచేతనంటే వారు అటు మాంసాహారము, ఇటు శాఖాహారము తీసుకుంటూ, ఏ ఒక్క పద్ధతిని అంటిపెట్టుకొని యుండకపోవుటయే కారణము. వీరలు శాంతికాముకులు అయిన ఆహారము కొరకు పశుపక్ష్యాదులను వేటాడి, జీవన యాత్ర సాగించేవారు. వీరు స్వతంత్రప్రియులు. వీరు ఎక్కడను బానిసత్వపు బ్రతుకునకు అలవాటు పడక, స్వతంత్రముగా జీవించే వారు. అందుచేతనే వీరు గ్రామాలలో స్థిరబడలేక, అడవుల వెంబడి గ్రామాలకు దూరముగా స్థిరనివాసమూ ఏర్పరచుకొనుటయు కారణమైనది. అంతేగాక ఆదిభారతీయులైన వీరు దురాక్రమణమును తలచకుండుట వారు దూరముగాపోయి బ్రతుకుటకు దుర్భరమైన కారణము అయి ఉండవచ్చు. వీరు

అమాయకంగా కనుపించినను, చాలా కరుకైన వారు, స్ఫురద్రూపులు, అనాగరికంగా కనుపించినను వన్యవిధాన సాంస్కృతి వీరిలో చిహ్నంగా కనిపిస్తుంది. ఆర్యుల దురాక్రమణ ఫలితంగా స్థిరనివాసాలను కోల్పోయిన యీ సంతతి ఒక్కచోట నిలువక వలసలు పోవడం ద్వారా చిన్నాభిన్నమై పోయారు. అందుచేత వీరు యెంతమంది యేయే ప్రదేశాలలో యున్నారో యనేది తెలుసుకొనడం కూడా కష్టమై పోయింది. అదెంతవరకు పోయిందంటే వాల్మీకులు, బోయలు వీరు వేరనే వరకు పోయింది.

వీరు ఆంధ్రప్రదేశ్ లో షుమారు 30 వేలుపైగా యుండవచ్చు. కాని భారత దేశపరముగా ఆలోచించినట్లయితే బోయలు బిల్లుల జాతికి చెందినవారు కావటంవల్ల వీరిజనాభా మొత్తం భారతదేశములో 53, 38, 371 దోపిడీలకు, దౌర్జన్యాలకు గురికాబడ్డ వీరు తిరుగుబాటుతో అవే దోపిడీలు, దౌర్జన్యాలకు పాల్పడటం వల్ల నేరస్థ జాతులుగా పరిగణింపబడి చరిత్రలో నిలిచిపోయారు. మతరాజ్యపరంగా, వీరిని నేరస్థజాతులుగా చిత్రించి వీరు అభివృద్ధి చెందకుండా గతంలో అణచివేయబడ్డారు. మనరాష్ట్రంలో కొన్ని కొన్ని ప్రాంతాలలో ఇంకను వీరు నేరస్థజాతులుగానే పరిగణింపబడి చిత్రహింసలకు గురి కావించబడుచున్నారు. పరిశోధనలలో తేలిన విషయం, భారత దేశ స్వాతంత్ర అనంతరము దేశము మొత్తముగా గిరిజనుల అభివృద్ధికి మార్గాలు

అన్వేషించి కార్యక్రమాలు రూపొందించేటప్పుడు, మన రాష్ట్రములో బోయవారికి చాలా అన్యాయం జరిగిందని చెప్పవచ్చు. ఎందుచేతనంటే వీరిని గిరిజనుల జాబితాలో చేర్చుకొనక, అలక్ష్యముచేశారు. తర్వాత కొంతమంది బోయ కుల నాయకులు, సంఘసంస్కర్తల పోరాట ఫలితంగా ఈ బోయవారిని "డినోటిఫికేషన్ ట్రైబ్స్" జాబితాలో చేర్చారు. అందుచేత వీరి అభివృద్ధి ఆశించినంతగా జరగక పోవుటగాక నత్తనడకగానే సాగినది.

## కాకర్లలో బోయలు

మన రాష్ట్రంలో శ్రీకాకుళం జిల్లాలో కాకర్ల అనే గ్రామములో ౮౦ కుటుంబాల బోయలు నివసిస్తున్నారు. ఇంత పెద్ద సంఖ్యలో రాష్ట్రంలో పలుగ్రామాలలోను వీరు ఉండక పోవచ్చు. అందుచేత వీరి స్థితిగతులను పరిశీలించడానికి కాకర్లగ్రామాన్ని పరిశీలనకు తీసుకోవడమైనది.

కాకర్ల గ్రామవాసులైన బోయలు పగలు సోమరులవలె ప్రవర్తించి, రాత్రియందు ఇతరగ్రామాలకు వెళ్లి దొంగతనాలు, దోపిడీలు చేసుకొని రావటం జీవనవిధానంగా సాగిస్తున్నారు. అందుచేత ఆయా గ్రామపెద్దలు చిన్న చిన్న నేరాలను, దొంగతనాలను ఈ బోయలపై నెట్టి, వారిని చిత్రహింసలకు గురిచేయటంవల్ల అమాయకులైన బోయవారు సహితం ప్రతీకారంగా అదే వృత్తిని చేపట్టి

జీవన విధానముగా పాటించటం గమనార్హం. ఈ దొంగ తనాలకు దోపిడీలకు మూలకారణము అగ్రవర్ణలనే భూస్వాముల మద్దత్తుతోనే అనేది గమనించవలసిన విషయం. ఎందుచేతనంటే వీరిక సమయాలలో భూస్వాములు వీరికి పెట్టుబడి పెట్టి పోషించి, దోపిడీలలో తెచ్చిన ధనరాసులను, బంగారములను, వీరు తీసుకొని, వీరిని మరల ఆ పనులకే ప్రోత్సహించటం లేదా వారిని హింసించటం ఆనవాయితీగా అయిపోయింది. గ్రామ పెత్తందారుల స్వార్థముతో పాటు, ధనాపేక్షలు ఈ బోయవారి అభివృద్ధికి ఆటంకాలుగా అయిపోయాయి.

గత కొద్ది కాలముగా ఈ వాల్మీకులయొక్క స్థితిగతులను మార్చటానికి, వారిని నేరస్థజాతుల జాబితానుండి తొలగించటానికి, వారి అభివృద్ధికి, విజ్ఞాన సముపార్జనకు, ఆర్థిక ప్రగతికిగాను, గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమమును అచ్చటి యువకులు తీసుకొని కార్యక్రమాలను సాగించటం హర్షనీయం.

ప్రభుత్వ అధికారులైన శ్రీ. యస్. ఆర్. శంకరన్, ఐ. ఏ. యస్. శ్రీ కె. మాధవరావు ఐ. ఏ. యస్. శ్రీ యస్. నారాయణన్ ఐ. ఏ. యస్. శ్రీ యమ్. వి. థామస్. ఐ. పి. యస్. శ్రీ కె. స్వామినాథన్ ఐ. ఏ. యస్., గార్లదృష్టిని ఆకర్షించుకొని, వారిసహాయ సహకారాలతో భూదానోద్యమ బోర్డువారి సహాయముతో పొందిన 100 ఎకరముల భూమిలో 50 ఎకరాల భూమి స్వంతముగా సాగుచేసుకొని ఒక సహ

కార సంఘమును నేర్పరచుకొని దీనిద్వారా భూమిని సాగు చేసుకొని పండించి, ఫలితమును పొందిన వాల్మీకి కులస్థులను వారికృషికై సాధించిన కార్యకర్తలను అభినందించక తప్పదు. వ్యవసాయము ఆరునెలల కాలము జరుగుచున్న మిగిలిన ఆనుమానముల కాలములో ఈబోయల జీవన పరిస్థితులు దుర్భరము కాగలవనే దృష్టితో 100 పాడి పశువులను ప్రభుత్వ పరంగా సంపాదించి వారి అభివృద్ధికి కారణమైన విధానాలు మిగిలిన గ్రామాలలో గిరిజన, హరిజన, బలహీన వర్గాల ప్రగతికి ఆదర్శప్రాయముగా తీసుకొనుట ఎంతె అయిన అవసరము.

కాకర్ల వాల్మీకుల అభివృద్ధికి కార్యక్రమాల నిర్వహణకు, మూలకారణమైనవారు శ్రీ జి. వెంకటస్వామి. ఎమ్. కామ్., గారి త్యాగనిరతి, నిస్వార్థ ప్రజాసేవలే కారణము అని చెప్పక తప్పదు. ఇటువంటి కార్యకర్తలు గ్రామ గ్రామాన వెలసిన ఆ గ్రామనిర్మాణ కార్యక్రమాలేగాక, బలహీన వర్గాల ప్రగతికి కారణము కాగలదు.

ఆంధ్రప్రదేశ్ లోగల బోయల ముఖ్య జీవన విధానంలో మార్పులు తీసుకురావటానికి, దీర్ఘాయుతమైనటువంటి కార్యక్రమములు ప్రవలు, ఇటు ప్రభుత్వము తీసుకొనకుండా సాధ్యపడదు. నవ సమాజ నిర్మాణము వెనుకబడిన జాతుల వారి అభివృద్ధి పైననే ఆధార పడినదని గుర్తెరిగి కార్యక్రమాలు తీసుకొనాలి. దేశపరంగా, ఆంధ్రప్రభుత్వము

బిల్లుల కిస్తున్న సదుపాయాలను, గుర్తింపును, మన రాష్ట్రములో బోయవారికి కూడాయివ్వాలి. ఆనాడు వీరి అభివృద్ధికి అవకాశము ఏర్పడుతుంది. వీరి అభివృద్ధికిగాను, ఈ క్రింది ప్రత్యేక సదుపాయాలు కల్గించవలసిన అవసరాన్ని గుర్తించి వ్యవహరించవలసినదిగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను కోరుచున్నాము.

1. ఉచిత విద్యతోపాటు ఉద్యోగ భాద్యత.
2. బంజరు భూముల పంపకముతో పాటు వ్యవసాయమునకు కావలసిన వస్తువుల సౌకర్యము ఏర్పరచుట.
3. ఆశ్రమ పాఠశాలలును, వయోజన విద్యాకేంద్రాలను పెట్టించి వీరు ఆర్థికంగా, సాంఘికముగా, వైజ్ఞానికముగా, విద్యారంగాలలో పురోగమించుటకు అవకాశముల కల్పించ వలయును.
4. అడవి ప్రాంతాలలో నివసించు బోయలకు అడవుల సంపదలో న్యాయమైన వాటా ఇచ్చుటయేగాక, అటవి బంజరులనువీరికి మాత్రమేఇచ్చి ప్రోత్సహించవలెను.
5. పెన్నా గృహవసతితోపాటు నివాసయోగ్యమైన గట్టి గృహముల నిర్మాణము చేయించి వీరికి నూతన ఉత్సాహమును, నవనాగరికత జీవిత విధానములను అలవరింపు చేసుకొని, అభివృద్ధి చెందుటకు అవకాశము కల్పించ వలయును.

6. వీరు విద్యార్జన చేయుటకుగాను ప్రత్యేకమైన స్కాలర్ షిప్పులు సౌకర్యములు కల్పించవలయును.

7. కుటీరపరిశ్రమలను, లఘు పరిశ్రమలను వీరికై ప్రవేశ పెట్టి, వీరు ఆర్థికంగా అభివృద్ధి చెందుటకు ప్రభుత్వము కృషిచేయవలయును.

8. పుష్టికరమైన ఆహారములో లోపమువల్ల అంగవైకల్యాలతో, వ్యాధిగ్రస్తులుగా జీవించుచున్న ఈజాతులకు గిరిజనసంక్షేమ శాఖద్వారా పౌష్టిక ఆహారమును సరఫరా చేయవలసినదిగా కోరుచున్నాము.

9. మొబైల్ ఆసుపత్రులను ఏర్పాటు చేసి వీరి ఆరోగ్య పరిరక్షణకు పూనిక వహించవలయును.

ప్రజా సంఘములు, సాంఘిక సంస్కర్తలు, సాంస్కృతిక సంఘాలవారు, ప్రభుత్వం అంతా కలిసి యీ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ఓపికతోను క్రమశిక్షణాయుతంగా త్యాగబుద్ధితో నడిపించగలిగితే మన భారతదేశం ప్రపంచ దేశాలలో అగ్రగామిగా పురోగమించడమే గాక మనకు గర్వకారణం కాగలదు.

సమసమాజ నిర్మాణం కావాలని కోరే యువతరంలో పాతుకుపోయి కుళ్ళి దుర్గంధిస్తున్న మూఢనమ్మకాలు, కరడు కట్టిన, బీటలువారిన కులవ్యవస్థను సమూలంగా నాశనం చేయడంద్వారా దేశంలో ప్రజలంతా దేశీయులేగాక వారంతా

రకంగా చెప్పాలంటే ఇంకా చేస్తూనేవుంది. నాగరికతకే, మానవత్వానికే, మచ్చగడకే, కళంకమనదగిన అస్పృశ్యత వుద్భవించింది. అస్పృశ్యులు అగ్రవర్ణాలవారి పాద ఘట్టనలో, సాంప్రదాయ గ్రంథాల, సాంఘిక ఆచారాల పైశాచికత్వానికి బలై, మనిషి కేవలం జీవన్మృతులుగా మాత్రమే మిగిలిపోయారు. 'మెడకో ముంత, మొలకో చీపురు' వారికి మన భారతీయవ్యవస్థ అందిచ్చిన వారసత్వపు ముద్రలు. ఊరికి వెలుపలగా వంటరిగా, నిస్పృహాలలో, నిరాశతో అతి దీనమైన స్థితిలో బ్రతికిన అస్పృశ్యతులను చూస్తుంటే చరిత్ర పేరిగట్ల ఎందుకింత కసిపూనింది అని ఆవేదన కల్గుతుంది. యేశక్తులు వీరిని ఇలా తయారుచేసినవో అని ఆలోచిస్తే హృదయం ద్రవించి అర్థమౌతుంది. చదువుకున్న సంస్కారులు, సనాతన ఛాందస భావాలచేత ప్రేరేపితులైన అభివృద్ధి నిరోధకులు సమాజాన్ని కట్టుదిట్టంగా కులపు చట్రంలో బిగించి వుంచాలనే ప్రయత్నించారు. కాని అది సాధ్యపడలేదు. సంస్కారులు, సంస్కరణాభిలాషులు, విప్లవమూర్తులు, అభ్యుదయవాదులు, హేతువాదులు ఈ నికృష్ట సాంఘిక వ్యవస్థపై ఎదురు తిరిగారు. సమాజంలో నిమ్నజాతీయులు వారుపోగొట్టుకొన్న స్థానాన్ని వారికి సంపాదించి పెట్టాలి. వారూ మానవులే అని గుర్తించాలి. వారి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికమైన పురోగతి కల్గించాలనీ, వారిలో చైతన్యాన్ని కల్గించి జాగృతిని రగిల్చ

జాతిరత్నాలుగా మాణిక్యాలుగా తయారు చెయ్యాలని ప్రయత్నించారు. అలాంటి మహోన్నత భావాలను స్మరించే టప్పుడు డాక్టర్ అంబేద్కర్‌ను మర్చిపోకూడదు. ఆయన జాతికి చేసిన సేవ అమూల్యమైంది. విభిన్న దుష్టశక్తులతో, ఛాందసులతో ఆయన నిరంతర పోరాటం సాగించారు. [illegible] కులాలకు కొన్ని సౌకర్యములు కల్పించారు. వారిని మానవులుగా గుర్తింపచేయుటం కోసం, వారిలో చైతన్య స్రవంతి సృష్టించి దాన్ని మహోత్తరమైన విల్లువగా తయారు చేశాడు. వ్యక్తిత్వపరంగా ఎన్నో అవకాశాలు కల్పించాడు. ఊరికి వెలుపలగా దిష్టిబొమ్మల్లా, జీవన్మృతులుగా జీవిస్తున్న ప్రజలకు ఒకమార్గాన్ని చూపించి ఆధునిక భారతదేశ చరిత్రలో చిరస్మరణీయుడైన వ్యక్తిగా మిగిలిపోయాడు. ఆయన రూపొందించిన సూత్రాలే, ఆయన సూచించిన విధానాలే నాటి బ్రిటీషు ప్రభుత్వమునుండి ఈనాటి జనతా ప్రభుత్వం వరకూ నామమాత్రంగానైనా అమలుపర్చలేదు. ఇక్కడ ఆయనచేసిన కొన్ని ప్రతిపాదనలు పేర్కొనాలి.

అయితే ఇక్కడ ఒక్కవిషయం గ్రహించాలి. ఇన్ని సంక్షేమ పథకాలు ప్రభుత్వం రూపొందించినా - అభ్యుదయ వాదులు అనేక సూచనలు చేసినా, సాంఘికంగా హరిజనులు నేటికీ వెనుకబడినవారిగానే మిగిలిపోయారు. నిర్మొహమాటంగా చెప్పాలంటే వారిపట్ల అగ్రవర్ణాలవారి పెత్తందార్ల, భూస్వాముల దృక్పథం మారలేదనే చెప్పవచ్చు.

ఇలాంటి స్థితిలో పెద్దోళ్లు కులాలకు వర్తించిన సంక్షేమ సంఘాలు బూడిదలో పోసిన పన్నీరు చందంగా తయారై వారికి సరియైన సాంఘిక న్యాయం జరగడంలేదని, ఘంటా పథంగా చెప్పవచ్చు. భారతీయ సమాజంలోని చాలామంది వ్యక్తులు వారిని హృదయ పూర్వకంగా స్వీకరించటంలేదు. వారి సమస్యల పట్ల సానుభూతిలేదు. వారి సంక్షేమం పట్ల సరైన బాధ్యతని ప్రదర్శించటం లేదు. మనం చాలా అభివృద్ధి సాధించాం అని గర్వపడుతున్నాం కాని గ్రామాలలో మాల పల్లెలు, మాదిగ వాడలు ఇంకా దూరంగానే వున్నవి. ఈ విచక్షణా విధానం పోవాలి. దానికి హరిజనులు కాని వారి యొక్క బాధ్యత చాలావున్నది. వారిలో ఆత్మవిశ్వాసాన్ని ఆత్మగౌరవాన్ని కల్గించాలి. వారి సాంఘిక దాస్య విముక్తి కోసం, రాజకీయ రక్షణల కోసం, విద్యాభివృద్ధి కోసం ఇతరులు పాటుపడినప్పుడు వారి సమస్యలు తేలిగ్గా పరిష్కరింపబడుతాయి. తద్వారా సమాజంలో మిగతా వారు తమ సాంఘిక బాధ్యత నెరవేర్చుకొన్నట్లు అవుతుంది. కాని వాస్తవంలో ఇది జరగటంలేదు. దినపత్రిక తెరవగానే మనకు ఘోరాతి ఘోరమైన వార్తలు కన్పిస్తున్నాయ్. ఒక గ్రామంలో హరిజనుడి సజీవ దహనం, మరొక గ్రామంలో హరిజనులు త్రాగే నీటిలో అశుద్ధాన్ని కలపటం, ఇంకొక చోట హరిజన స్త్రీ మానభంగం – మనకు దగ్గరలో వున్న చిన్న వోగిరాల, జంగంగుంట్లపాలెం, గరికపాడు, గొల్లపూడి,

కంటికచర్య వృత్తాంతాలు — ఇవన్నీ ఘోరాతిఘోరమైన విషయాలు. మానవత్వానికే కళంకం తెచ్చే వృత్తాంతాలు. ఇటువంటివి జరగకూడదు. మానవులందరూ ఒక్కటే అన్న సూక్తిని మనసా, వాచా, కర్మణా, భారతీయులు ఆచరించిన నాడు మాత్రమే ఈ లోకభూయిష్టమైన ఆచారం నశించి పోవడానికి అవకాశం వుంటుంది. దీన్ని బృహత్తరమైన సాంఘిక బాధ్యతగా స్వీకరించాలి. హరిజనులకు సాంఘిక గౌరవాన్ని కల్పించి సంపత్తి భాగస్వామ్యం సమాజం తనని తాను గౌరవించుకొన్నట్లు అవుతుంది.

సామాన్యంగా సంఘంలో కొన్ని కులాలను నీచమైన పేర్లు పెట్టి పిలవటం అగ్రవర్ణాలవారికి ఆచారంగానో, లేక అలవాటుగానో తయారైంది. అలాంటి హేయమైన అలవాటుకు స్వస్తి చెప్పాలి.

అస్పృశ్యతను ఏరూపంలో ఆచరించినా అది నేరమని ప్రభుత్వం చట్టాన్ని జారీ చేసింది. కాని ఆ చట్టం చట్టంగానే మిగిలిపోయింది. చట్టాన్ని నిర్దుష్టంగా ప్రభుత్వం అమలు చేయగలుగుతుందే తప్ప ప్రజా జీవన స్రవంతిలో మార్పు తీసుకురాలేదు. దాన్ని ప్రజలు గ్రహించాలి. ధైర్యవంతులైన యువకులు అస్పృశ్యతను ఎదుర్కొనాలి. దాన్ని ఆచరించే వారితో పోరాటం సాగించాలి. ఎన్నో సాంఘిక పోరాటాలు జరిగితేనోగాని ఈ దాష్ట్య ఆచారం నశించేది?

ఇక రిజర్వేషనుల విషయం. ఈ మధ్య హరిజనులకు, తదితర వెనుకబడినవారికి రిజర్వేషన్లు ఇవ్వటం దేనికి? వాళ్ల వల్ల ఇతరులకు అన్యాయం జరగటం లేదా? అన్న, దాని వల్ల కొందరు ప్రతిభావంతులు నాశనం కావటంలేదా? అన్న కుతర్క-వాదనలు వినిపిస్తున్నవి. అలా వాదించేవాళ్లు ఒక విషయం గ్రహించాలి. ఈనాడు రిజర్వేషన్లు పొందే జాతులు తరతరాలుగా ఎన్ని అవమానాలకు గురైనారో, ఎంత నైచ్యదాస్యానికి బలైనారో అర్థం చేసుకోవాలి. వారి సమగ్ర సహకారంతో ముఖ్యాభివృద్ధి మీదనే సాంఘిక ప్రగతి ఆధారపడివున్నదని మర్చిపోరాదు. మన సమాజంలో పీడితులైన వారు అభివృద్ధి పొందే అవకాశం లభిస్తున్నప్పుడు దానిని గర్హించటం వివేకం అనిపించుకోదు. భూమిని పండిస్తుంది వీరు, వెట్టిచాకిరి, పాకీపని చేస్తుంది వీరు. కాని వీరు అణగారిపోతున్నారు.

ఆఫీసుల్లో, కార్యాలయాల్లో, పాఠశాలల్లో, కళాశాలల్లో ఉద్యోగాలు చేస్తున్న హరిజనులకు సరైన ట్రీట్‌మెంట్ లభించటంలేదనే చెప్పవచ్చు. వాళ్లను తొందరగా ప్రమోషన్ కానివ్వకానివ్వ వారికట్లు ఇతర్లు ప్రవర్తించేతీరులో మార్పు రావాలి. వారిని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ విమర్శించటం, అవహాస్యం చేయుటలాంటి విషయాలను కట్టిపెట్టాలి. మన సమాజంలో వుండే ఆర్గానిక్ యూనిటీ భంగం కానివ్వకూడదు. దీన్ని చాలా ముఖ్యమైన సాంఘిక బాధ్యతగా స్వీకరించాలి.

వ్యాపార వాణిజ్య, పారిశ్రామిక రంగాలలో వారి జనాలు చెప్పుకోదగినంత అభివృద్ధిని సాధించలేకపోయారు. దానికి కారణం వారి దారిద్ర్యము ఆర్థికదుస్థితి. ఇలాంటి స్థితి తొలిగిపోవాలంటే ఆయారంగాలలో వారికి సముచిత స్థానాన్ని కల్పించాలి. వారుకూడ ఆయా రంగాలలో నిష్ణాతులై దేశానికి, జాతికీ, వన్నెతెచ్చే వ్యక్తులుగా తయారుకావాలి. వారికి సంబంధించిన చట్టాల్ని ప్రభుత్వం ఇంకా విస్తృతమైనరంగంలో తయారుచేస్తే బాగుంటుంది. కొన్ని వర్గాలకు కొన్ని కులాలకే పరిమితమై, ఆయా రంగాలలో నెలకొని ఉన్న గుత్తాధిపత్యాలకు వారి తత్వం నశించినపుడే నిజమైన ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది.

హరిజనుల హక్కులను స్వేచ్ఛగా అనుభవించే వాతావరణాన్ని, అవకాశాన్ని, కల్పించాలి. దీన్ని భారతీయులందరూ బృహత్తరమైన బాధ్యతగా స్వీకరించాలి. ఎవరైనా మూర్ఖులు హరిజనులను విచక్షణాబుద్ధితో చూసినట్లయితే వారికి ప్రజలేతగిన బుద్ధిచెప్పాలి.

అతి హేయమైన కులవ్యవస్థ ధ్వంసం అయితే నేతప్ప హరిజనోద్ధరణ సరైన మేలు జరగదు. ఈ విషయం నిర్వివాదాంశము. ఈ కులవ్యవస్థ పోవాలంటే కులాంతర వివాహాలు జరగాలి. ముఖ్యంగా బడుగు వర్గాలకు చెందిన హరిజనులకు, పెత్తందారీ వర్గాలకు చెందిన అగ్రవర్ణాలవారి మధ్య ఈ సంబంధాలు ఏర్పడాలి. దీనివల్ల తరతరాలుగా కరడుగట్టిన

పోయిన భేద భావం నశిస్తుంది. నశించాలి. లేకపోతే మనం నాగరికులం కాము. చిన్న అభ్యుదయ కరమైన మార్పులకు కూడా ఉలిక్కిపడేవారు మన సమాజంలో చాలమంది వున్నారు. అలాంటి వారికి ఇవన్నీ విడ్డూరంగా కన్పిస్తవి. వారిని విద్యావంతులుగాను, సర్వమానాధికారులుగాను, విప్లవకారులుగాను చెయ్యాలి. మంచి ఆదర్శవంతులైన యువకులు ఇలాంటి వివాహాలు చేసుకున్నందువల్ల చాలమేలు జరుగుతుంది. ఉత్సాహవంతులైన యువకులు ఇలాంటి సాంఘిక కార్యక్రమాలను నిర్వహించాలి.

హరిజన సంక్షేమం కొరకు ప్రభుత్వం తన పరిమితుల మేరకు అనేక చట్టాలను, రూపొందించితే, అవి వాస్తవరూపంలో అమలుజరగాలంటే ప్రజల మానసిక వ్యవస్థలో మార్పులు రావాలి. సరైన పద్ధతులలో ఆలోచించ గల్గిన వ్యక్తులు కావాలి. దాన్ని ఒక గొప్ప పవిత్ర కార్యంగా, సాంఘిక బాధ్యతగా ఒక పోరాటంగా ప్రజలు, యువకులు ఆదర్శవంతులు స్వీకరిస్తే .. హరిజన సంక్షేమం ఏర్పడుతుంది. లేదా డాక్టరు అంబేద్కరు కలలుగన్న భారతదేశం ప్రత్యక్షమౌతుంది. కాబట్టి దీనివల్ల భారతీయులందరూ అప్రమత్తులై వ్యవహరించాలి.

# మొదటి పంచవర్ష ప్రణాళిక

(రూపాయలు లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | వార్తాసౌకర్యములు | 30.21 |
| 2 | రోడ్లు | 30.21 |
| 3. | అరకులోయ అభివృద్ధికి గ్రాంటు | 16.23 |
| 4. | వైద్య, ప్రజా ఆరోగ్యము | 13.83 |
| 5. | విద్య | 8.0 |
| 6. | భూములు వగైరా | 4.79 |
| 7. | చెంచుజాతి సంక్షేమమునకు | 3.53 |
| 8. | గ్రామీణ నీటిసరఫరా | 3.03 |
| 9. | సహకారము | 2.07 |
| 10. | వ్యవసాయము | 1.93 |
| 11. | పశువైద్యము | 1.32 |
| 12. | స్త్రీ - సంక్షేమము | 1.01 |
| 13. | పరిపాలన | 0.71 |
| 14. | కుటీర పరిశ్రమలు | 0.[illegible]7 |
| 15. | చేపలు | 0.26 |
| | | 117.77 |

# రెండవ పంచవర్ష ప్రణాళిక

(ఖర్చు లక్షల రూపాయలలో)

| | | |
|---|---|---|
| 1. | వార్తా సౌకర్యములు | 17.35 |
| 2. | వైద్య ప్రజారోగ్యములకు | 27.0[illegible] |
| 3. | విద్య | 19.[illegible]6 |
| 4. | భూసాములకు | [illegible]7.[illegible]3 |
| 5. | వ్యవసాయము | 1[illegible].13 |
| 6. | సహకారము | 13.70 |
| 7. | గ్రామీణ నీటిసరఫరా | 8.70 |
| 8. | పశువైద్యము | 8.52 |
| 9. | అరకులోయ అభివృద్ధి | 3.[illegible]6 |
| 10. | స్త్రీ-సంక్షేమము | 3.23 |
| 11. | కుటీరపరిశ్రమలు | 3.14 |
| 12. | ఇతరములు | 2.60 |
| 13. | నీటిపారుదల | 2.51 |
| 14. | చెంచుజాతుల సంక్షేమము | 2.[illegible]1 |
| 15. | స్వచ్ఛంద సంస్థలకు సహాయము | 1.29 |
| 16. | రోడ్లు | 1.08 |
| 17. | పరిపాలన | 0.43 |
| 18. | పరిశోధనాసంస్థలు | 0.34 |
| 19. | కేడిమోలు | 0.29 |
| 20. | చేపలు | 0.21 |

| | | |
|---|---|---|
| | బ్రాటోవరు | 250.04 |
| 21. | సాంస్కృతిక కార్యక్రమములు | 0.15 |
| 22. | భూసారము | 0.06 |
| | | 250 25 |

# మూడవ పంచవర్ష ప్రణాళిక

(అర్బు లక్షల రూపాయలలో)

| | | |
|---|---|---|
| 1. | వార్తాసౌకర్యములు | 86.78 |
| 2. | సహకారము | 24 52 |
| 3. | విద్య | 13.74 |
| 4. | భూసారము కాపాడుట | 19 31 |
| 5. | ఎరుకల, యానాది, లంబాడీల సంక్షేమము | 7 67 |
| 6. | గ్రామీణ నీటిసరఫరా | 6.92 |
| 7. | కుటీర పరిశ్రమలు | 5 18 |
| 8. | వ్యవసాయము | 3.08 |
| 9. | వైద్యము | 2.76 |
| 0. | చిన్న తరహా నీటిపారుదల | 2.57 |
| 1. | భూమి | 2.51 |
| 2. | ప్రజారోగ్యము | 1.89 |

| | | |
|---|---|---|
| 13. | స్వచ్ఛంద సంస్థలకు సహాయము | 1.31 |
| 14. | చెంచు జాతుల సంక్షేమముకొరకు | 0.50 |
| 15. | చేపలు | 0.93 |
| | మొత్తము : | 178.77 |

# 1967-68 సంవత్సరపు ప్రణాళిక

(ఖర్చు లక్షల రూపాయలలో)

| | | |
|---|---|---|
| 1. | వార్తాసౌకర్యములు | 8,440 |
| 2. | కార్పొరేషనులకు సహాయము | 4,050 |
| 3. | పోడు వ్యవసాయము | 1,250 |
| 4. | ఆశ్రమ పాఠశాలలకు | 0,821 |
| 5. | పుస్తకములు వగైరా నిమిత్తము | 0,649 |
| 6. | ఎరుకల, యానాది, లంబాడీల గృహములకు | 0.330 |
| 7. | స్కాలర్‌షిప్పులు | 0 220 |
| | వసతిగృహములకు | 0.057 |
| 9. | మిడ్డేమిల్ నిమిత్తం | 0.031 |
| | | 15.848 |

## నాల్గవ ప్రణాళికలో ఖర్చుచేసినది

168.28 లక్షల రూపాయలు

## గిరిజనుల సంక్షేమ బడ్జెట్ 1974-75 సం॥ లకు

లక్షల రూపాయలు

| | | |
|---|---|---|
| 1. | నాన్ ప్లేన్ | 412.64 |
| 2. | స్టేట్ ప్లాన్ | 150.00 |
| 3. | కేంద్రము-స్కీము | 41.35 |
| 4. | ప్రత్యేక ఆహార కార్యక్రమము | 70.00 |
| 5. | నాల్గవ ప్రణాళిక ఖర్చు | 716.22 |

## ఆంధ్రప్రదేశ్ గిరిజనుల జనాభా వైచిత్ర్యం

పురుషులు –84.02%   స్త్రీలు –817.35

| | |
|---|---|
| శ్రీకాకుళము | 2,12,4 9 |
| విశాఖపట్టణము | 2,99,070 |
| తూర్పుగోదావరి | 1,19,927 |
| పశ్చిమగోదావరి | 51,723 |
| కృష్ణ | 50,742 |
| గుంటూరు | 1,05,4 8 |
| ఒంగోలు | 58,111 |
| నెల్లూరు | 1,30,377 |
| చిత్తూరు | 66,801 |

| | |
|---|---|
| కడప | 26,611 |
| అనంతపూరు | 44,878 |
| కర్నూలు | 32,407 |
| మహబూబ్ నగర్ | 8,300 |
| హైదరాబాదు | 4,667 |
| మెదక్ | 120 |
| నిజామాబాద్ | 578 |
| ఆదిలాబాద్ | 1,32,293 |
| ఖరీంనగర్ | 16,[illegible]33 |
| వరంగల్ | 43,287 |
| ఖమ్మం | 2,01760 |
| నల్గొండ | 519 |
| | 16,57,657 |

# గిరిజనాభివృద్ధి సంక్షిప్తముగా 1975-76

(గిరిజన సంక్షేమశాఖ)

| | ఆశ్రమపాఠశాలలు | ప్రాథమిక పాఠశాలలు | ప్రాథమికోన్నత పాఠశాలలు | వసతిగృహములు | ఆసుపత్రులు | సంచారక వైద్యయూనిట్లు | ప్రజారోగ్యయూనిట్లు | మాతృశిశు సంరక్షణ కేంద్రము | పశువైద్య ఆసుపత్రులు | కాలనీలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళము | 27 | 17[illegible] | 2 | 15 | 2 | 3 | 1 | 1 | 0 | |
| విశాఖపట్టణము | 33 | 234 | 5 | 24 | 1 | 2 | 1 | 2 | 5 | |
| తూర్పుగోదావరి | 26 | 164 | 3 | 15 | 1 | | 1 | | 4 | |
| పశ్చిమగోదావరి | 17 | 125 | 3 | 17 | 1 | 1 | 1 | 1 | 4 | |
| కృష్ణా | | 1 | | 21 | | | | | | |
| గుంటూరు | | 1 | | 23 | | | | | | |
| ఒంగోలు | 1 | 8 | | 20 | | 1 | | | | |
| నెల్లూరు | 1 | 4 | | 16 | | | | | | |
| చిత్తూరు | | 31 | | 1 | | | | | | |
| కర్నూలు | 2 | 40 | | 8 | | 2 | | | | |
| అనంతపూరు | | 5 | | 6 | | | | | | |

| | | | |
|---|---|---|---|
| 4. | గుజరాత్ | 53 | 61.40 |
| 5. | కేరళ | 1 | 5.93 |
| 6. | మధ్యప్రదేశ్ | 126 | 35.67 |
| 7. | తమిళనాడు | 2 | 13.53 |
| 8. | మహారాష్ట్ర | 44 | 50.25 |
| 9. | నాగాలాండ్ | 15 | 68.71 |
| 10. | ఒరిస్సా | 75 | 58.93 |
| 11. | రాజస్థాన్ | 18 | 22.93 |
| 12. | ధారానగర్ హవేలి | 2 | 100.00 |
| 13. | హిమాచల్ ప్రదేశ్ | 7 | 68.[illegible] |
| 14. | త్రిపుర | 5 | 24.75 |
| 15. | మణిపూర్ | 20 | 100.00 |
| | మొత్తము | 481.0 | 80.66 |

| షెడ్యూల్డు జాతులు | పరిశోధించిన కుటుంబముల సంఖ్య | రెండవ వృత్తి లేనివారి శాతము | సంవత్సరములో కొంత భాగము దుంపలు ఆహారముగా గల వారి శాతము | సంవత్సరములో కొంత భాగము దినమునకు ఒక పూట మాత్రమే భోజనం చేయువారి శాతము |
|---|---|---|---|---|
| భిల్లులు | 182 | 82 | 87 | [illegible] |
| [illegible] | 357 | 47 | 87 | 59 |
| కోలి | 267 | 61 | 99 | 11 |
| ఠాకురు | [illegible]01 | 12 | 96 | 54 |
| తడ్వి | [illegible]71 | 35 | 96 | 50 |

| రాష్ట్రము పేరు | జనాభా వేలలో | షెడ్యూల్డు జాతుల వారి శాతము మొత్తము జనాభాకు |
|---|---|---|
| ఇండియా | [illegible]7,9[illegible]5.0 | 6.9 |
| 1. ఆంధ్రప్రదేశ్ | 1,6[illegible]7.7 | 3.8 |
| 2. అస్సాం | 1,9.9.7 | 12.8 |
| 3. బీహారు | 4,932.8 | [illegible].8 |

| | | |
|---|---|---|
| 4. గుజరాత్ | 3,734.4 | 14.0 |
| 5. హరియాన | — | — |
| 6. హిమాచల ప్రదేశ్ | 141.6 | 4 1 |
| 7. జమ్ము మరియు కాశ్మీర్ | — | — |
| 8. మధ్యప్రదేశ్ | 8,347.2 | 20.0 |
| 9. కేరళ | 239.4 | 1.3 |
| 10. మహారాష్ట్ర | 2,954.3 | 5.9 |
| 11. మణిపూర్ | 344.5 | 31.3 |
| 12. మేఘాలయ | 814.2 | 80.5 |
| 13. మైసూరు | 231.3 | 0.8 |
| 14. నాగాలాండ్ | 457.6 | 88.6 |
| 15. ఒరిస్సా | 5,071.9 | 23.1 |
| 16. పంజాబు | — | — |
| 17. రాజస్థాన్ | 8,125 5 | 12.1 |
| 18. తమిళనాడు | 311.5 | 0.8 |
| 19. త్రిపుర | 450.5 | 29.0 |
| 20. ఉత్తరప్రదేశ్ | 193.6 | 0.2 |
| 21. వెస్టుబెంగాల్ | 2,533.0 | 5.7 |

కేంద్రపాలిత ప్రాంతములు

| | | |
|---|---|---|
| 1. అండమాన్ నికోబార్ దీవులు | 18.1 | 13.7 |
| 2. అరుణాచల ప్రదేశ్ | 260.4 | 79.0 |

| | | |
|---|---|---|
| 3. చండీఘర్ | — | — |
| 4. ధాద్రా మరియు నగర్ హవేలీ | 64.4 | 86.9 |
| 5. ఢిల్లీ | — | — |
| 6. గోవా-డామన్-డయ్యూ | 7.7 | 0.9 |
| 7. యల్. యమ్. ఎ. దీవులు | 29.5 | 93.9 |
| 8. పాండిచ్చేరి | — | — |
| మొత్తం | 29,474.6 | 690.7 |

## ఆంధ్రప్రదేశంలో ఆదివాసులు (1971)

| | లక్షలలో |
|---|---|
| 1961 లో | 13.24 |
| 1971 లో | 16.58 |
| మొత్తం హరిజనులు | 57.75 |
| | 87.57 |

## జిల్లాలవారీగా ఆంధ్రప్రదేశ్ ఆదివాసుల సంఖ్యలు (1971)

| జిల్లా | లక్షలు |
|---|---|
| అనంతపూరు | 0.65 |
| చిత్తూరు | 0.67 |
| కడప | 0.27 |
| తూర్పు గోదావరి | 1.19 |
| గుంటూరు | 1.05 |
| కృష్ణ | 0.51 |
| కర్నూలు | 0.32 |
| | 4.66 |

| | |
|---|---|
| నెల్లూరు | 1.30 |
| ప్రకాశంజిల్లా | 0.53 |
| శ్రీకాకుళం | 2.12 |
| విశాఖపట్నం | 3.00 |
| పడమటి గోదావరి | 0.52 |
| అదిలాబాదు | 1.69 |
| హైదరాబాదు | 0.05 |
| కరీంనగర్ | 0.16 |
| ఖమ్మం | 2.02 |
| మహబూబునగర్ | 0.08 |
| మెదక్ | —— |
| నల్ గొండ | 0.01 |
| నిజామాబాద్ | 0.01 |
| వరంగల్ | 0.43 |
| | 11.92 |

## భారతదేశ ఆదివాసుల జనసంఖ్యా అంకెలు 1951

భారతదేశంలో పెద్ద ఆదివాసుల జనసంఖ్యలు

| | |
|---|---|
| సంతాలులు | 31,54,107 |
| భిల్లులు | 38,3[illegible],371 |

| | |
|---|---|
| గోండులు | 39,91,767 |
| ముండాలు | 10,19,038 |
| ఓరాను | 14,44,554 |
| ఖోండులు | 8,45,981 |
| | 1,42,93,878 |

ఆంధ్రప్రదేశంలో ఆదివాసులు జిల్లాలవారీగా

| | లక్షలు | శాతం |
|---|---|---|
| తెలంగాణాలో | 4 | 43 |
| మిగతా ఆంధ్రప్రదేశంలో | 12 | 15 |
| | 16 | 58 |

యానాదులసంఖ్య జిల్లాలవారీగా 1961

| జిల్లా | 1921 | 1951 | 1961 |
|---|---|---|---|
| 1. నెల్లూరు | 79,000 | 1,03,149 | 1,17,504 |
| 2. గుంటూరు | 18,000 | 23,958 | 35,270 |
| 3. చిత్తూరు | 11,000 | 14,641 | 32,341 |
| 4. కర్నూలు | — | — | 992 |
| 5. కృష్ణ | 9,000 | 11,979 | 6,022 |
| 6. తూర్పుగోదావరి | — | — | 1,514 |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | పశ్చిమగోదావరి | — | — | 2,815 |
| 8. | కడప | — | — | 8,062 |
| 9. | శ్రీకాకుళము | — | — | 293 |
| 10. | విశాఖపట్నం | — | — | 107 |
| 11. | అనంతపురము | — | — | 360 |
| 12. | చెంగల్పట్టు | 4,500 | — | 5,9[illegible]9 |
| | | 1,21,5[illegible]0 | 1,55,72[illegible] | 2,11,370 |

మొత్తము ప్రజాసంఖ్య 20,33,679 లో శాతం 6.44.%

## యానాదులు - వారి పుట్టు పూర్వోత్తరాలు

అనాదిగా భారతదేశంలో స్థిరనివాసము ఏర్పరచుకొని, అరమరికలు లేక, కాయకష్టముపై జీవితాన్ని ఆనందదాయకముగా గడపిన అనాది ద్రావిడ సంతతిని దురాక్రమణదారులైన ఆర్యులు హేళనగా వీరిని "యానాది" అని నామకరణము చేసి యుండవచ్చును అని, చరిత్ర ఆధారాలు లేని ఒక ఆలోచన. వీరు ఆంధ్రప్రదేశ్ లో ముఖ్యముగా నదీతీరాల వెంట ఎక్కువగా నివసిస్తారు. ముఖ్యముగా వీరు చిత్తూరు, నెల్లూరు, కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలలో ఉన్నారు.

పూర్వకాలములో వీరు విల్లంబులు ధరించి జీవించుట ఆధారముగా అగవలు వీరిని విల్లియన్లు అంటారు. అట్లాగే వెలికొండలలోను పల్లపునూతలోను, వీరిని చెంచులు అంటారు. వీరు

ఆయా ప్రాంతాలలో చుంచులను తినటంవల్ల వారికి ఆపేరు వచ్చినట్లుగా తెలుస్తుంది.

వీరికి యానాది అని పేరువచ్చుటకు చరిత్రకారులు చాలా కారణములు చెప్పినప్పటికి ఆధారములు లేనందు వలన, ఇదమిద్ధముగా ఇది కారణము అని చెప్పలేదు. కారణములు కల్గినా వీరు అనాదిగా దక్షిణ భారతదేశములోని ఆదిమజాతి ట్రైబ్ తెగకు చెందినవారనేది నిర్వివాదాంశము.

వీరి జీవనోపాధి గసికి కఱ్ఱలతో, ఎలుకకన్నాలను త్రవ్వి ఎలుకలను పట్టడం, చేపలనుపట్టడం, ఆకులు అలములతో కాలక్షేపము చేయుట వీరి కులవృత్తి. వీరు నల్లగా ద్రావిడుల వలెనే కనిపిస్తారు. నీగ్రోలవలె ఉంగరాలు తిరిగిన జుట్టు గోచి పెట్టుకొని అనాగరికముగ కనిపించిన నాగరికులవలె అన్యాయాలు. అక్రమాలు చేయటంగాని, ఇతరులను నొప్పించటంగాని దొంగతనాలు చేయడంగాని వీరికి చేతకాదు. వీరు కలిగిన దానితో కాలక్షేపము చేయుచు, ఉన్నదానితో సంతృప్తిపడి, జీవితాలను వెళ్లబుచ్చుకొనుచున్నారు. వీరికంటూ ప్రత్యేకమైన భాషలేదు. తమిళనాడులో తమిళమును, తెలుగునాడులో తెలుగును, మాట్లాడుతారు. వీరికి పెద్ద ఆచారకట్టుబాట్లుగాని, కులపెద్దల తీర్పులుగాని లేకపోయినందున ఎవరికి వారే యమునాతీరే గా జీవిస్తుంటారు. వీరికి ఆత్మాభిమానము మెండు. వీరు మాట్లాడేభాషలో

సంస్కృత భావపదాలు మచ్చుకైనా కనుపించ నందువల్ల వీరు మాట్లాడే భాషను అచ్చ తెలుగుగా తీసుకొనవచ్చును.

ఆంధ్రరాష్ట్రములో వీరు రమారమి 1, 50, 000 వేల మంది ఉన్నారంటే అతిశయోక్తి కాదు. వీరు ఇంత జనాభా కల్గియుండి కూడా ఈనాటివరకు పురోభివృద్ధి చెందక పోవటానికి కారణమువి? చాలా మంది సంస్కర్తలు, పెద్దలు, నాయకులు వీరి అభివృద్ధి కొరకై కృషిచేసినట్లు కన్పించినా, వారు చిత్తశుద్ధితో పనిచేసినట్లు కనిపించలేదు. ఎందుచేతనంటే యానాదులు ప్రస్తుతము ఉంటున్న కాలువగట్ల వెంబడిగా యుంటున్న గుడిసెలను మార్పుచేయుటగాని, వీరు ఉన్నత విద్యను అభ్యసించటానికిగాని, మంచి వస్త్రములు ధరించి నవ నాగరికముగా మెలగటానికి గాని, పెద్దలను చేయలేపోవటం స్పష్టముగానే కన్పిస్తుంది. కొంచెము కటువుగా చెప్పాలంటే వీరి అమాయకత్వమును ఆసరాగా తీసుకొని, బొమ్మలతో ఆటలాడినట్లు, వీరిపై వీరినే పెట్టుబడిగా పెట్టి ధనాన్ని, కీర్తిని ఆర్జించిన పెద్దలు కూడా మనకు కనిపిస్తుంటారు.

వీరి ఇండ్లు అర్ధచంద్రాకారంగా ఎదురు బొంగులతో చెట్ల కొమ్మలతో కట్టబడివుంటాయి. చిన్నగావంగి దూరి లోన నివసిస్తుంటారు. సుమారు ఎత్తు 10 అడుగులు, వెడల్పు 6 అడుగులు వుండవచ్చు. వర్ష పునీరు గుడిసె లోనికి రాకుండుటకై ఒక కుండను ఇంటి మొకిరిపై బోర్లిస్తారు. దిగువనీరు లోనికి

రాకుండ మట్టిగోడలను వేస్తారు. గుడిసెపై సొర, చిక్కుడు, గుమ్మడి పాదులను పాకిస్తారు. వీరి పాత్రలు మట్టిపాత్రలే. ఈ గుడిసెల పరిస్థితి ఈనాటివరకు మెరుగు కాలేదంటే మనం ఎంత ప్రగతి సాధించామో అర్థమౌతుంది. వీరు ఎక్కువగా తాటిపండ్లు బురగుజ్జు తింటారు. యానాది దంపతులు ఎన్నడును ఒకరినొకరు విడనాడివుండరు. కష్టాలొచ్చిన నష్టాలొచ్చిన వారు ఒకరినొకరు విడనాడక వుందురు. భార్యాభర్తల అన్యోన్యతను వీరిని చిహ్నంగా చెప్పవచ్చు.

వీరు యానాదుల ఇంత దైన్యమే అదృష్టము లేని జీవితాన్ని గడుపుటకు కారణం. అటు అగ్రవర్ణాల అనాదరణ, యిటు బ్రిటిష్ ప్రభుత్వం అన్యాయంగా వీరిని నేరస్థుల జాబితాలో చేర్చి వారి భవితవ్యాన్ని అంధకారబంధురం చేయటం అనేది యదార్థము.

యానాదుల పుట్టు, గిట్టుటతో కాదుగాని సమస్య మన రాష్ట్రంలోని లక్షా ఏబదివేలుగా వున్న ఈ యానాదులను ఎట్లా అభివృద్ధిచేయాలనే తలంపుతో వారికట్టు, బొట్టు తీరు తెన్నులపైనను వారిపుట్టుక ప్రవృత్తులు మున్నగు వాటిపై ఎక్కువదృష్టిని కేంద్రీకరించక భావిభారత భాగ్యోదయములో బాగుగా, రాష్ట్ర ప్రగతి మార్గంగా ఈజాతుల అభివృద్ధికి కొన్నిసూచనలను చేస్తున్నాను. సహృదయులైన పాఠకులు వీరి పురోభివృద్ధికి రాష్ట్రములో వెనుకబాటు తనమును రూపుమాపి సర్వసమానత్వం కోసం కృషిచేసి ఆమేరకు పనిచేస్తారని ఆశిస్తాను.

యానాదులు అనాది ద్రావిడులు. వీరు పుట్టుకతో ద్రవిడ సంతతి అయినందున పౌరుషం, ఆత్మాభిమానం, దృఢమైన శరీరం కలిగి ఆరోగ్యవంతులుగా మెదలు యున్నారనేది నిర్వివాదాంశము. తెలుగుగడ్డ వీరి జన్మస్థానం. అనాదిగా తెలుగులో వీరు తెలుగుతనం, తెలుగుభాష కలిగి వున్నందున వీరిని ఆది తెలుగులుగా చెప్పవచ్చు.

చరిత్రాధారాలు లేనంత మాత్రాన వీరిని చరిత్ర హీనులుగా చిత్రించడం క్షమించరాని విషయం. గతములో వీరికి గాదు ఎవరికీ చరిత్ర లేదు అనేది యదార్థం. ఒక వేళ గతంలో వీరికి సంబంధించిన చరిత్ర వున్నదనుకుంటే అది ఆర్యులచేత నాశనం చేయబడిఉంటుంది.

ఈనాడు మనకున్నదనుకుంటున్న భారతదేశ ప్రాచీన చరిత్ర, సంస్కృతి ఆది వుత్తరహిందూస్థాన ఆర్యులకు చెందినది మాత్రమే. అనాది ద్రావిడ సంతతియైన యానాది కులస్తులను అభివృద్ధిచేయుట అంటే అది ద్రావిడులను, అనాది మన సంస్కృతిని పునరుద్ధరించు కొఱకటమేనని గుర్తెరిగి తెలుగు ప్రజానీకం యానాదివారి అభివృద్ధికి కృషి చేయవలసిందిగా కోరుచున్నాము.

# వీరి అభివృద్ధికి మార్గాలు

1. భిన్నాభిన్నంగా చిందరవందరగా రాష్ట్రం అంతటా వ్యాపించి వున్న వారిని కొన్ని ప్రదేశాలలో కేంద్రీకరించి వారికి సాంఘికజీవితాన్ని ఏర్పాటు చేయుట.

2. పక్కా గృహాములను నిర్మించి బంజరుభూమి ఇచ్చి వీరికి జీవనోపాధి కలిగించుట.

3. వీరికి విద్యాబుద్ధులను నేర్పుటకు గాను ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొని బాలవాడి ద్వారా, రెసిడెన్షియల్ స్కూల్స్‌ను పెట్టి పుష్టికరమైన ఆహారాన్ని సరఫరా చేసి ఈ జాతి బాల బాలికల విద్యాభివృద్ధికి తోడ్పడుట.

4. వీరు వసుధా చేపలు పట్టడంలో నైపుణ్యం కలిగిన వారగుటచేత వారికి కావలసిన సదుపాయములను కలిగించి చేపలమార్కెటింగ్ కోఆపరేటివ్ సహకార సంఘాలను ఏర్పరచి వాటి ద్వారా ఆర్థికంగా అభివృద్ధి చెందుటకు అవకాశాలను కల్పించవలెను.

5. వీరిలో వయోజన విద్యాభివృద్ధికి కృషిచేయుటయే కాక, వీరి ఆచారవ్యవహారములను మార్పు చేయుటకు గాను, సాంఘిక సంస్కర్తలు, అభ్యుదయ వాదులు వీరి వద్దకు పోయి కృషిచేసి మార్పు తెచ్చుట.

పై అంశాలను ఆచరించటం ద్వారా అటు ప్రభుత్వం, ఇటు అభివృద్ధి కాముకులు, వీరిలో నిద్రాణమై యున్న శక్తిని పునరుజ్జీవింప చేసి వారు ఇతరుల కంటె తక్కువ వారము కామని వారి పుట్టుకకు అర్థం వుందని, వారి పురోభివృద్ధికి లక్ష్యాలను ఏర్పరచుకోవలసిన అవసరాలను, యీ వాదులను గుర్తించేలాగు చేయటం ద్వారా వారు అవతి కాలంలో అభివృద్ధి చెందటానికి అవకాశంవుండునే ఉద్దేశ్యంతో వ్యవహరించ వలసినదిగా కోరుచున్నాము.

## ఈ తరం ఆదివాసి

యుగయుగాలుగా దాస్యవిముక్తి లేకుండా, అనాగరికంగా, అడవులలోను, లోయలలోను, యుండే ఆదివాసులు తమ ఆర్థిక సమస్యల పరిష్కారానికి, జీతాల పెంపుదలకు, పనికి, ఆహారము కొరకు, వెట్టిచాకిరి విముక్తి కొరకు, గత 30 సం॥లుగా అనేకమైన పోరాటములు సాగించవలసి వచ్చినది. మాజీ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రముల ఆర్థిక కార్యక్రమమును అనుగుణ్యముగా, వెట్టి చాకిరి రద్దు చట్టము వచ్చినది. కాని భూస్వాములు, భూయజమానులు, అధికారులు, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు సరిగా న్యాయము చేకూర్చలేక పోయినారు. క్రైతము గిరిజనులు పోరాటాలు సి. పి. ఐ మరియు సి. పి. యమ్ పార్టీల ఆధ్వర్యములో సాగించారు. ఆ దినములలో అడవులలో

ఆకులు, కందఫలములు, వేళ్ళు తిని ఉద్యమములను నడిపి విజయమాతృకలు చేసుకొన్నారు.

ఆదివాసులకు ముఖ్యవృత్తి వ్యవసాయము. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము, గిరిజనుల ఉద్ధరణ కొరకై "రాష్ట్ర గిరిజన సహకార సంస్థను స్థాపించి వారి సముద్ధరణకై అవిరళ కృషి జరుపుచున్నది. గిరిజన కార్యాలయాల ద్వారా లాండ్ కాలనీల సొసైటీలు ఏర్పాటుచేసి, ఫారెస్టు బంజరు భూములను సాగులోనికి తీసుకొని, గిరిజనులకు పట్టాలు యిచ్చి, వ్యవసాయ పరికరముల నిమిత్తము, రసాయనిక ఎరువులు, విత్తనములు, సప్లయి చేసినవారు. కాని, వారి దైనందిన జీవితములు బాగుపడలేదు. ఈ భూమి సమస్య వారిని క్షయవ్యాధిగా వేధిస్తుంది. కౌలుదారీ చట్టము వచ్చిన తర్వాత సాగుచేసే భూమికి చెల్లించవల్సిన కౌలు మాత్రం తగ్గింది. కాని కొన్ని సంవత్సరముల తర్వాత ఆదివాసులు పాత పద్ధతిపై భూమిధర చెల్లించినారు. అందువలననే వారు భూమిలేని యజమానులు అయినారు. ఆ విధంగా ఆదివాసుల చేతులలో యుండే భూమి చాలాకొద్ది. ఆ సాగుబడి భూమిలో వచ్చే ఫలితముతో, తమ కుటుంబములను పోషించుకొనుట అసాధ్యముగా యున్నది.

ఆదివాసుల జీవనపరిణామాలను, స్థితిగతులను మార్చాలని వాంఛిస్తే, వారు చేపట్టవలసిన ముఖ్య కార్యక్రమము ఒక్కటే. భూస్వాముల స్వాధీనంలో యుండే భూమి స్వాధీనం

చేసుకొని ఆదివాసులకు ఉచితంగా పంచాలి. కౌలుదారీ చట్టము, "స్వంత కమతం" అనే దానిని కూలీలను పెట్టుకొని భూస్వామి సాగుచేసుకొనే భూమికి కూడా వర్తించేలాగ సవరించబడింది. ఆ చట్టంలో స్వంత కమతానికి గల యీ నిర్వచనము ఫలితముగా భూస్వాములు వేలాది ఎకరములు స్వంతకమతములుగా నిలుపుకోగలిగినారు.

నగరాలలోను, పట్టణాలలోనూ, నివసించుచూ, వివిధ రకములైన వృత్తులను చేపట్టి పనిచేసుకొనేవారుకూడా స్వంత కూలీలను పెట్టి భూమిని సాగుచేయించుకో గలుగుతున్నారు. వారు, వారి కుటుంబాలు బ్రతికేందుకు ఈ భూమిలో ఫలితం అవసరం లేదు. వారు ఆ భూమిలో అడుగుకూడ పెట్ట కూడదు. అలాంటి వారు యాజమాన్యం కల్గియుండే విధానము చాలా అన్యాయము. తాము, తమ కుటుంబాలకు వాస్తవముగా భూములను సేద్యము చేసుకొనేటట్లుగా ప్రభుత్వము ఉత్తర్వులు జారీ చేయవలయును.

ఆదివాసుల జీవన పరిణామానికి, ఇటువంటి భూములను ఉచితంగా పంచాలి. ఇది వీరి సమస్యలను మెరుగుపరచేందుకు ఉపకరిస్తుంది. గత పది సంవత్సరాలలో గిరిజనులు ఒరిస్సా, కేరళ, పశ్చిమ బెంగాల్, కేంద్రపాలిత ప్రాంతాలైన నాగాలాండ్, న్యూజోరాయ్‌లలో పండ్లు, పూలతోటలు విస్తృతంగా పెంచేవారు. తమకున్న కొద్దిపాటి భూమిలో వచ్చే పంటలతో జీవితాలుగడపటం ఆదివాసులకు కష్టతరముగా

యుండేవి. పండ్లు, పూలతోటల వ్యవసాయాన్ని వ్యాపారాలకు మార్చేందుకు వారికి అవకాశాలు లేవు. ఈ విధంగా గిరిజనులు అనేక విధములుగా బాధపడుతూ, రైతులకు మార్కెట్ రేటు ఎంతవున్నా తోటయజమానులు ఎకరానికి 200 లేక 300 రూపాయల వరకు చెల్లించి భూమినంతా కొనేశారు. వ్యవసాయ సేద్యమునకు తగినంత భూమిలేక పోవుట వలన గిరిజనులు రైతుల కొండహస్తాలలోను, వెట్టి చాకిరీ దారుల భారంతోను, వడ్డీ వ్యాపారస్తుల మృత్యుహస్తాలతోను నలిగిపోయేవారు. చాలామంది ఆదిమవాసులు "పోడు" అనే వ్యవసాయపద్ధతిని ప్రారంభించి రైతుగూండాల కబంధ హస్తాలలో నలిగిపోయి భూమిని వారికి దత్తంచేసి కార్మిక శ్రేణులలో చేరిపోయారు.

ఆదివాసుల జీవితాలను మెరుగు పరచేందుకు కుటీరపరిశ్రమలనుగాని, భారీపరిశ్రమలనుగాని, జౌళీ పరిశ్రమలనుగాని, కండసార ఫ్యాక్టరీలను గాని, జూట్ పరిశ్రమలనుగాని, ఆయా ప్రాంతాలలో యేర్పాటు చేసి వారిలో ఆదివాసులను నియమించటం మరియొక మార్గం. తగినంత భూమిలేక వేరే వృత్తి దొరకేందుకు అవసరమైన పరిశ్రమలు లేనందున ఆదివాసులు తమకిష్టమైన జీవనము (కూలి) సంపాదించుకు నేందుకు వ్యవసాయ కార్మికులుగా పనిచేయక తప్పటంలేదు. వ్యవసాయ పనులు సంవత్సరము పొడవునా యుండవు. యున్నతరుణంలో కూడా చాలా బలహీనమైన జీతాలు యిస్తారు. ఇతర పను

పోల్చి చూసినపుడు వారికన్న గడ్డికోత కూలీలు, కలుపు కూలీలు, నూర్పుడు కూలీలు, నాటు వేయటంలో కూలీలు, కళ్ళాల్లోని కూలీలు మెరుగుగా ఉన్నారు. అయితే యీ పని రెండు మాసాలవరకే ఉంటుంది. గిరిజనులలో సామరస్యము, సంఘీభావం, ఐక్యతాన్వేషణం మూలంగా కొంత మెరుగైన వేతనాలు దొరుకుతున్నాయి. రాజకీయ పార్టీలవారు యెన్నో కిసాన్ సభలు ఏర్పాటుచేసి ప్రభుత్వము వారికి అనేకమైన విజ్ఞప్తులను చేసినప్పటికి ప్రభుత్వము ఎటువంటి చర్యలను గైగొనలేదు.

## ప్రభుత్వము తీసుకొనవలసిన జాగ్రత్తలు :-

నాటి గిరిజనుడే నేటి పురజనుడు అని మాజీ ప్రధాని స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ కలకత్తాలో 1959 కిసాన్ సమ్మేళన మహాసభలో ఉద్ఘాటించారు. భారతదేశంలో వివిధ జాతులు, మతాలు గలవారు ఎంతమంది ఉన్నా ప్రజాస్వామిక దేశం కావటంవల్ల సోదర భ్రాతృత్వం కొట్ట వచ్చినట్లుగా కనబడుచున్నది. వీరి జీవితాలు బాగా బాగు పడవలయునన్న ప్రభుత్వము వారు యెన్ని వేల కోట్లురూపాయలు హెచ్చించినను యెన్నో పంచవర్ష ప్రణాళికలు చేసినను అమలు జరిపే ప్రభుత్వ అధికారులలో మార్పు రానిదే చాల కష్టం. కేంద్రప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వాలు వీరి సముద్ధరణకై పలురకములైన సహాకారసంస్థలు కావా

కేషన్లు, సొసైటీలు ఏర్పాటు జేయుడం జరిగినది. కాని పెద్దలోపం కలదు. ఏమనగా, ఆయా సంస్థలలో నూటికి, 80 శాతం గిరిజనులకు ఉపాధికల్పిస్తే వారి స్థితి గతులు పుట్టుకతోనే తెలియును. గనుక మౌనం చేయటం జరుగగా. వీరిలో కొందరు సంఘసేవకులు, సంఘసంస్కర్తలు, సూరలు వున్నారు. ప్రభుత్వము వారు విజిలెన్స్ సెల్స్‌ను యేర్పాటుజేసి గిరిజనుల పురోభివృద్ధికొరకు పాటుపడు తున్నారో ఆ గమ్యం, జేరవలయును వన్న ఈ సూచనను అములు జరిపిస్తే మంచిది.

## సవరలు

భూమి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు ఉద్భవించి కొన్ని కోట్ల సంవత్సరాలు అయినట్లుగా చరిత్రకారులు చెప్పుచున్నారు. భూమిమీద ఉద్భవించిన జీవరాసులు రెండు రకములుగా చెప్పబడుచున్నవి.

1) మానవకోటి

2) జంతుకోటి

భగవంతుని సృష్టిలో అన్ని జీవరాసులు సమానం. కారణం మనుష్యులకు జంతువులకు శరీరాంగములలోగాని రూపురేఖలలోగాని ఎటువంటి వ్యత్యాసంలేదు. మానవుడు సంఘజీవి. మానవుడు తన దైనందిన జీవితములో ఎన్నో

సమస్యలు ఎదుర్కొన్నా రావలసిన సమస్యలు వస్తాయి. క్రీస్తుపూర్వం మానవుడు శరీరమును కప్పుకొనుటకు ఆకులు వాడెడివాడు. తినుటకు పండ్లు, తేనె, కందఫలములు తినెడివాడు.

నేటికి జీవన ప్రమాణాలలో పురోగమిస్తున్న వ్యవహారాలలో భూమిమీద నడచుటకు కార్లు, రైళ్లు, ఆకాశములో విహరించుటకు పక్షులలాగా విమానములు, చంద్ర మండలమును సహితం చేరుటకు రాకెట్లు వాడకంలోకి వచ్చినవి ఇటువంటి వైజ్ఞానిక నూతన శకములో సమాజములో ఆర్థికముగా, నైతికముగా, సామాజికముగా, వ్యవస్థాపరముగా మానవుడు ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నాడు.

భగవంతుని సృష్టిలో అన్ని జన్మలలోకెల్ల మానవ జన్మ ఉత్తమమైనది. మానవులలో కొందరు పండితులు కాగా, మరికొందరు నిరక్షరాస్యులుగను ఉండుట సహజము. మానవ జీవన ప్రమాణాలు అనుకుల బొంగరాలాంటివి. ఉదా:- ముల్లు వచ్చి అరిటాకుమీద పడిన, అరిటాకు వచ్చి ముల్లుమీద పడిన అరిటాకుకే ప్రమాదము. అట్లా నాటినుండి నేటివరకు కొండ జాతుల వారికి అనాగరిక వ్యవహారములు తెలిసికొనక ఒకానొకప్పుడు మానవులు ఏవిధంగా జీవించుచున్నారో ఊహించుటానికి వీలుపడదు. కోస్తాజిల్లాలో గిరిజన జాతులలో ఎరుకల, కోయ, చెంచు, యానాది, లంబాడి, బుడబుక్కల, సవర మొదలగు కొండజాతులవారు ఉన్నారు. వీరిలో యానాదులు లంబాడీలు గ్రామాలలో నివసిస్తారు. వీరిలో

ఒక తెగవారు కొండల యందున, గ్రామముల శివారుల యందును, అడవి మధ్యప్రదేశముల యందును, అరణ్యముల యందును జీవించుచు కట్టెలు కొట్టుకొనుచు, నారవడకుచు, పండ్లు ఫలములు, అడవి మృగములను వేటాడి భక్షించి జీవించుట మనము కళ్లార చూచుచున్నాము. వీరు కొంత తెలంగాణా ప్రాంతములలోను, నల్లమల అడవులలోను, శ్రీశైలం, పెన్నానది అడవులలోను చెంచులు నివసిస్తారు. వారు అడవులలో యుండి కొండల మీద జీవిస్తారు. వారు పెద్దపులులను, చిరుతపులులను, కుందేళ్ళు మొదలగు జంతువులను వేటాడి జీవించెడివారు. వీరికి భాషలేదు. ఆంధ్ర రాష్ట్రములోని 20 మండలముల యందున్న చెంచులు, వీరు శ్రీకాకుళము తూర్పు పశ్చిమగోదావరి జిల్లాలలో నివసించెదరు. వీరి ఆచారవ్యవహారములలో కులసంఘ కట్టుబాట్లు విచిత్రంగా ఉంటాయి. వీరు విల్లంబులు ధరించి అడవి మృగములను వేటాడుట, వీరు సంగీత నృత్యవాయిద్యములతో దేవుని స్తుతించుట భక్తితో ప్రార్థనలు చేయుట, అడవి చెట్లను వనదేవతలుగ భోజనములు పెట్టుట విశేషంగా ఉండెడిది. పూర్వము వాల్మీకి మహర్షి బోయకుటుంబమునందు జన్మించెను. ఆయన రామాయణములో రాముడు అరణ్యవాసములో సీతమ్మను వెదకుచున్న సమయములో ఒక దండకారణ్యమున ఒక శబర స్త్రీ భక్తితో రామునకు ఫలహారములు పెట్టి వినయవిధేయతలతో నమస్కరించినది. ఆ మెనే

శబరి. రామరాజ్యములో సవరులకు ప్రముఖ స్థానము కలదు. వీరి చరిత్ర కట్టు, బొట్టు ఆచారవ్యవహారములు, స్థితిగతులు తెలిసికొనుటకు స్వర్గీయ రావుసాహెబ్ కళాప్రపూర్ణ గిడుగు రామమూర్తి పంతులుగారు తమ జీవిత సర్వస్వమును అర్పించిరి.

## సవరల గృహములు

సవరలు శ్రీకాకుళము విశాఖపట్టణమునకు ఉత్తర దిశగా, 80 మైళ్ళ దూరములో నున్న తూర్పు కనుములలోను, ఉభయగోదావరి జిల్లాలలోను నివసించుచున్నారు. సవరలు నివసించే అడవి ప్రాంతములు సెలయేరులకు దగ్గరగా ఉంటాయి. ఈ కొండప్రాంతములలో అడవులనుండి సాగము వెళ్ళుతూఉండిన ఏ సింహమో, ఏ పెద్దపులో, ఏ పుట్టలో నుండి ఏ పాము వచ్చి కాటువేస్తుందో చెప్పలేము. సవరలు నివసించే అడవి ప్రాంతములు చాలా అందముగా ఉంటాయి. వీరు పచ్చికబయళ్ళపైన, ఎత్తైన కొండలపైన, చిన్న చిన్న గుడిసెలు వేసికొని జీవిస్తారు. అడవులలో భయంకరమైన కొండలయందు కొండచిలువలు ఉంటాయి. ఇటువంటి సాహసమైన నిర్ద్వంద్వమైన జీవితము పాము పడగ క్రింద కప్పలాంటిది సవరల జీవితము. వారి జీవితములు మెరుగు పడుట కష్టము.

జాతి నవరులకన్న అధికులమని చెప్పుకుంటారు బొబ్బిలి, కావు; భీమ్మార్కు, చిక్కలి, కుడుంభా మొ॥ జాతి వారిని శుద్ధ నవరులు అని అంటారు. జాతి నవరులు శుద్ధనవరలను జాతి విహీనముగా ఎంచుతారు. శుద్ధనవరలకు భోజనము పరస్పరము చేయుటలేదు. "అగ్నిక్" అనే తెగవారు బట్టలు నేయుదురు. బట్టలు అల్లు నవర తెగవారు ప్రత్యేకముగా ఉన్నారు. కుండలు చేసేవారిని కుంభీ నవరలు అంటారు లోహపు పనులు చేసేవారిని "లూరా" అని అంటారు. హిందూ సంపర్కము కలిగిన నవరలు పంది మాంసమును తినరు. జంతుమాంసములను తినుటవలన నవరలలో హెచ్చుతగ్గులు వచ్చినాయి. తక్కువ వారింట అన్నము ఎక్కువవారు తినరు. క్రైస్తవ మతములో చేరిన నవరులను ఇతర నవరులు దూరంగా ఉంచుతారు. భోజనమునకు పిలువరు.

భర్త చనిపోతే నవర స్త్రీ మరల వివాహము చేసికొనవచ్చును. మరిది వున్న ఎడల అతనినే వివాహమాడుట సంప్రదాయము. భర్త అన్నను చేసికొనకూడదు. విడాకులు నవరులలో సాధారణముగా జరుగుతుంటాయి. ఇంకొక పురుషుని ప్రేమించి వివాహము చేసికొనదలచినట్లైతే ఆమెను పెండ్లి చేసికొనబోయే రెండవ భర్త మొదటి భర్తకు నష్టపరిహారముగా ఒకపోతునో పందినో ఇవ్వాలి. ఒక పురుషుని భార్య వేరొక పురుషునితో అక్రమ సంబంధాలు కలిగియున్నచో ఆ పురుషుడు ఆతని భార్యకు విడాకులు ఇచ్చి

అతనికి కావలసిన వందినో, పోతునో అతనిభార్య ప్రేమిస్తున్న వాడి దగ్గరనుండి తీసికొంటాడు. సవరులలో వ్యభిచారము చాలా తక్కువ. వారు ఎప్పుడు విడాకులు ఇచ్చుకొనవలె నంటే అప్పుడె ఇచ్చుకొనును.

వీరు సంప్రదాయములను ఆచారములను గౌరవిస్తారు. వీరు ధరించె బట్టలకు ఆభరణములకు భిన్నముగా వేరే బట్టలు ధరించిన యెడల వారు సహించరు. బంగారపు నగలు పెట్టు కొనరాదు. స్వగ్రామములోని పిల్లలను పెండ్లి చేసుకొంటము తక్కువ. హత్య చాలా నేరము గ్రామపెద్దల తీర్పు ప్రకారము హంతకుడు చనిపోయిన వానికుటుంబమునకు జరిమానా చెల్లించవలయును. హంతకుడు నేరము చేసినయెడల నేరమును ఒప్పుకొంటాడు. అబద్ధము ఆడుటకు వారు ఇష్టపడరు. దొంగతనము, వ్యభిచారము సవరులలో చాలతక్కువ సవరులకు మూఢ నమ్మకములు ఎక్కువ. వీరు ఊరి వెలుపల హద్దుగా ఉండు ప్రతి రాయిని కీటిని దేవతగా భావిస్తారు. చనిపోయిన పితృదేవతల ఆత్మలు వారి దగ్గరకు వెళతాయని వారి నమ్మకము. ఆ ఆత్మలకు ఆహారముగా ఇంటిలో ఒక మూలన ఒక కుండను వ్రేలాడకట్టి అందులో బియ్యము మిరపకాయలు, పెద్దఉల్లిపాయలు, చిన్నఉల్లిపాయలు, కొన్ని చిన్న అల్లముక్కలు రాగిపైసలు ఉంచుతారు. మూత ఎప్పుడు ఉంటుంది. వేరొక కుండను ఇంట్లో ఒక మూలన మూడు రాళ్ళపైన ఉంచుతారు. ఆకుండలో అన్నము ఉంచుతారు.

వారి పూర్వీకుల ఆత్మలు ఆ కొండలోనికి పోయి పదా
ర్థములను వాసన చూచిపోతాయి పితృదేవతల ఆత్మలు
తరచుగా ఇండ్లకు వస్తుంటాయని వీరి నమ్మకము. రాత్రి
పూటలు ఆయుధముల ప్రయోగము వినపడితే మగవారి ఆత్మలు
వచ్చాయని కుండలు చప్పుడైతే ఆడవారి ఆత్మలు వచ్చాయని
వీరి నమ్మకము. ఎవరైన పని మీద వెళ్ళుచున్నప్పుడు
ఎవ్వరు తుమ్మకూడదు. కుక్క, పిల్లి, ఉడుముపిల్లి, కీసుగ ఎదు
రైన రొండు అశుభముగా తలంచెదరు. కంది. పిల్లి, కలలో
వస్తే అశుభముగా తలచెదరు. ఉత్తరదిక్కుగా తలపెట్టి
పండుకొని కూడదని వీరి నమ్మకము.

ఆత్మకు చావు లేదని వీరి నమ్మకము. పాములకు, కోతు
లకు చావు లేదని, చంపబడితే కాని చావు లేదని వీరి నమ్మకము.
ఎవరైన చెట్టు మీదనుండి క్రిందపడితే లేక ప్రమాదవశాత్తు
మరణము సంభవిస్తే ఏదో దేవతకు కోపము వచ్చిందని వీరు
భావిస్తారు. మానవులలో పెద్ద ఆత్మ చిన్న ఆత్మలు ఉంటా
యని వీరి నమ్మకము. మానవుడు నిద్రపోతున్నప్పుడు ఈ
పెద్ద ఆత్మ తన ఇష్టము వచ్చినచోటుకు వెళ్ళుచుస్తూ ఉంటుం
దని వీరి నమ్మకము. మనము నిద్రపోతున్నప్పుడు పెద్ద ఆత్మ
దూరప్రదేశములో ఉన్న యెడల మనము ఎవరైన హఠా
త్తుగా నిద్రనుండి లేపిన యెడల పెద్ద ఆత్మ తొందరగా పని
లను చేయలేక పోవచ్చును. అందువలన మనము రోగాలపాలవు
తుంటామని వీరి నమ్మకము. ఒకవేళ ఎవరైన మాంత్రికుడు

ఈ పెద్ద ఆత్మను పట్టి బంధించవచ్చునని వీరి నమ్మకము. వయసు మళ్ళకుండ చనిపోతే దయ్యముగా మారవచ్చునని వీరినమ్మకము.

## గ్రామ పరిపాలన

సవర గ్రామములలో గ్రామాధికారిని "గామాంగ్" అని పిలుతురు. గ్రామకరణాధికారిని "బుయ్యా" అని అంటారు. "గోమాంగ్", "బుయ్యా"లకు వంశపారంపర్యంగా అధికారము బదలీ అగును. ఇది పూర్వపు గ్రామ కరణముల వారసత్వమును పోలి యున్నది.

## నాగరికత

ఆడవారు పచ్చబొట్టును బుగ్గమీద, మూతి క్రింద, గడ్డంమీద పొడిపించుకుంటారు. నొసటన నిలువుగీతను వేయించుకుంటారు. స్త్రీలు ముక్కుకు మూడు బెజ్జంలు పురుషులు కుడివైపున ఒక బెజ్జం వేయించుకుంటారు. వెండి, రాగి, ఇత్తడి తీగలను అందముగా పెట్టుకుంటారు. స్త్రీకి మెడలో పూసలదండలు నిండుగా వేసికోవడం ఎంతో ఉత్సాహం. మరియు ఇవి వారి యొక్క సంపదను సూచించును. గ్రామాధికారియైన "గోమాంగో" భార్య ఎక్కువ పూసలను ధరిస్తుంది. పురుషులు కడియాలు, ఉంగరాలు ధరిస్తారు. స్త్రీలు కాళ్ళకు కడియాలు, వ్రేళ్ళకు మెట్లు, చేత

లకు దండ, కడియాలు, ముంజేతికి ఉంగరాలు, మట్టిగాజులు ధరిస్తారు. స్త్రీలు పెట్టుకొనే బొట్టు ఎటువంటి మతచిహ్నము కాదు. అందముకొరకు మాత్రమే వీరు బొట్టు, కాటుక పెట్టుకుంటారు. వీరు ఆవులను, మేకలను, పందులను, ఎడ్లను, కోళ్ళను పెంచుతారు. వీరు గేదెలను, గొర్రెలను, దున్నలను మాంసమునకు ఉపయోగిస్తారు. వీరు గేదెలనుండి పాలు తీయక, అవి వాటిదూడలకే వదిలివేస్తారు. వీరు స్నానము చేయరు. అప్పుడప్పుడు ఒళ్ళు కడుగుకొంటారు. శరీరము పూర్తిగా తడవదు. అప్పుడప్పుడు తలను చింతపండుతోగాని ఒకరకమైన మట్టితోగాని తలస్నానముచేసెదరు. నవర స్త్రీలు నులకను పేనతారు, దీనిని సంతలో అమ్ముతారు. వీరికి పట్టణ ప్రాంత ప్రజాజీవితము తెలియదు. కేవలము సంతలోనే వీరికి మైదాన ప్రజలతో సంబంధము. సంతలకు పురుషులు, స్త్రీలు తమ సరుకులను కావళ్ళతోను, బుట్టలతోను, గుడ్డమూటల తోను మోసికొనిపోతారు. వీరు సంతలలో చింతపండు, కందులు, విప్పపప్పు, విప్పపూవు, జొన్నలు, దుంపలు, గుమ్మడికాయలు, కరక్కాయలు, ఆముదపుగింజలు, చేమ దుంపలు, ఈలవలు, పిసలు, తేనె, విప్పసారా, నులక త్రాడు మొదలగునవి సంతలో అమ్ముతారు. సంతనుండి తిరిగి వచ్చునప్పుడు వారికి కావలసిన కత్తులు, పూసలు బెల్లం ఎండు చేపలు, దారాలు, అద్దం, దువ్వెన, ఉప్పు, ఉల్లి పాయలు, కిరసనాయిలు, పొగాకు మొ॥ వానిని తెచ్చుకొం

టారు. సంతలో వస్తువుల కొనుటలో వస్తుమార్పిడి పద్ధతిని డబ్బుమార్పిడి పద్ధతిని అవలంబిస్తారు. వీరు వ్యవసాయమునకు గాను 'పోడు' వ్యవసాయ పద్ధతిని అవలంబిస్తారు. చెట్లు నరకటానికి "సేంటి" గొడ్డలి, నేలను గుల్లగా త్రవ్వటానికి గునపము ఉపయోగిస్తారు. పిచ్చిమొక్కలను ఉలితో నరుకుతారు. వ్యవసాయము సమిష్టి పద్ధతి కాదు. ఎవరి కుటుంబము వారు వారికి కావలసిన భూమిని పోడు వ్యవసాయ పద్ధతి ద్వారా పంటలను పండించుకుంటారు. సవర గ్రామాలకు గ్రామములోని ఒక గౌరవనీయుడైన పెద్ద పేరునుగాని లేక దగ్గరలో ఉన్న ఒక చెట్టు పేరునుగాని పెట్టుతారు. ఉదా॥ ఆ దగ్గరలో ఒక మర్రిచెట్టు ఉన్నదనుకుందాం. సవరలు ఆ గ్రామానికి మర్రిచెట్టు గ్రామము అని పేరు పెడతారు. గ్రామాలను నీటి వసతులకు సెలయేరులకు దగ్గరగా నిర్మించుకొంటారు. ఏదైనా అంటువ్యాధులు ప్రబలముగా ఉండి ఎక్కువమంది చనిపోయిన యెడల వారు ఆ గ్రామాన్ని వదలి వేరోచోటికి వలసపోయెదరు. వీరు గృహములను చక్కగా అలంకరించుకొనరు. అలంకారముగా ఉన్న ఎడల ఓర్వలేని వారు మంత్రతంత్రములను ఉపయోగించి వారిని చంపివేతురనే భయం.

# 1978–79 సం॥లో గుంటూరు జిల్లాలో షెడ్యూల్డు ట్రైబ్సు మరియు డినోటిఫైడ్ ట్రైబ్స్‌కు గాను వివిధ పథకాలు అమలు గురించిన సమీక్ష

గుంటూరు జిల్లాలో షెడ్యూల్డుట్రైబ్స్‌లో మెట్రిక్ లోపు విద్య నభ్యసించువారికి 1,8[illegible]2 బోర్డరుగలిగిన 24 ప్రభుత్వ హాస్టల్సు కలవు. వీటిలో 17 బాలురకు, 7 బాలికలకుగాను నడుపబడుచున్నవి. దీనిని గురించి 1978–79కి ఇచ్చిన ఎలాటుమెంటు మరియు ఖర్చులు యిందులో జతపర్చబడిన పట్టికలో పొందుపరచబడినవి.

## యస్. టి. హాస్టలు బోర్డర్సుకు ప్రభుత్వము వారి పాఠ్యపుస్తకముల, నోటు పుస్తకముల సప్లయి :-

1978–79 సంవత్సరమునకు గాను ప్రభుత్వహాస్టలులో బోర్డర్సుకు రెండు జతల బట్టలు, నోటు పుస్తకములు స్కూలు [illegible] ప్రతిఒక్కరికి యివ్వబడినవి. జిల్లాలో 1 నుండి 10 వతరగతి వరకు 14,[illegible]22 యస్. టి. విద్యార్థులు చదువుచున్నారు. వీరందరికి గవర్నమెంటుచే ప్రచురింపబడిన పాఠ్యపుస్తకములు సప్లయి చేయబడినవి. దీనికి సంబంధించిన వివరములు అనుబంధములో వివరించబడినవి.

# ఉపకార వేతనములు :-

మెట్రిక్ లోపు వారికి :- 1978-79 సం॥లో 1నుండి 10వ తరగతి చదువుచున్న పిల్లలకు 5,538 యస్. టి. పిల్లలకు మరియు 325 డినోటిఫైడ్ ట్రైబ్స్ పిల్లలకు స్కాలర్ షిప్పులు మంజూరు చేయబడినవి. వీటి విలువ వరుసగా రు. 2,39,535, మరియు రు. 14,430/-.

ఉన్నత విద్య నభ్యసించు వారికి :- ఈ సంవత్సరములో పోస్టు గ్రాడ్యుయేట్, మెడికల్, పాలిటెక్నికల్ కోర్సులతో సహా కలిపి 436 షెడ్యూల్డు ట్రైబ్సు వారికి, 16 డీనోటిఫైడ్ ట్రైబ్సు వారికి ఉపకార వేతనములు మంజూరు చేయబడినవి. వీటి విలువ వరుసగా రు. 4, 24, 878/-లు.

డి. యస్. టి. స్కూళ్లు :- ఈ జిల్లాలో సింగిల్ టీచర్లచే నడుపబడే డి. యస్. టి. స్కూళ్ళు నాలుగు కలవు. యివి కాకుండా సీతానగరం కాలనీలో యస్. టి. అండ్ డి. యస్. టి. పిల్లలకు ఒక అప్పర్ ప్రయిమరీ స్కూలు నడుపబడుచున్నది. ఈ స్కూళ్ళలోని పిల్లలకు ఒక జతబట్టలు మరియు ప్రభుత్వమువారు ప్రచురించిన పాఠ్యపుస్తకములు అందచేయబడినవి. వీటిలో చదువుచున్న పిల్లలకు మధ్యాహ్న భోజన సౌకర్యముకూడా కలుగ చేయబడుచున్నది.

ప్రత్యేక పోషకాహార పథకము :- ఈ పథకము క్రింద 183 కేంద్రములు కలవు. వీటిలో 0-6 వయస్సుగల పిల్లలు, తల్లులు కాబోవు యస్.టి. జాతులవారు 12, 911మంది సహాయముపొందుచున్నారు. 1978-79 సంవత్సరములో ఈ పథకము క్రింద రు. 3,31,413/-లు బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరులద్వారా ఖర్చుచేయబడింది. నిరుద్యోగులైన వారికి టైపురైటింగ్ ప్రోత్సాహకము చేయుటకుగాను 1978-79 సం॥లో 8మందికి రు. 100/-లు చొప్పున మంజూరు చేయబడింది.

సోషల్ వెల్ఫేరు డిపార్టుమెంటువారిచే నడుపబడు చున్న కుట్టు శిక్షణా కేంద్రములో ముగ్గురు గిరిజన బాలికలకు డ్రస్ మేకింగ్ నందు శిక్షణ యివ్వటం జరిగింది. వారికిగాను నెలకు రు. 100/-లు ఒక్కొక్కరికి ఉపకార వేతనం క్రింద చెల్లించుట జరిగింది. వారికి ఒక్కొక్కరికి రు. 487/లు ఖరీదుచేసే కుట్టుమిషనులు కొని యిచ్చుట జరిగింది

27 మంది గిరిజనులకు 1978-79 సం॥ పకుగాను విజయవాడ ఆటోడ్రైవింగ్ స్కూలులో మోటార్ డ్రైవింగ్‌లో శిక్షణ యిచ్చుట జరిగింది. వారికి లైసెన్సులు కూడా యిప్పించుట జరిగింది.

6 ఎలాకేషన్ గ్రాంటుల క్రింద యిద్దరు నిరుద్యోగు లైన విద్యావంతులకు (గిరిజనులకు) నెలకు రు. 150/లు మంజూరు చేయబడింది.

## జిల్లాలోనిచెంచులకు ఇంటిగ్రేటెడ్ ట్రైబల్ డెవలప్ మెంటు ఏజన్సీ స్కీము క్రింద సహాయం -

1978-79 సం॥లో 234 చెంచువారికి ఒక్కొక్కరికి రు. 1,000/-లు వారు గేదెలు తదితరమ్ములు, మరియు వెదురు కొనుటకుగాను రు 2,33,000లు మంజూరుచేయబడి నది. ఇది నూటికి నూరుశాతము సబ్సిడీగా మంజూరు కాబడినది.

### ఆర్థికాభివృద్ధి కొరకై పథకాలు:-

1. చిన్నతరహా నీటి పారుదల పథకము:- నాదెండ్ల పంచాయితీసమితిలోని గోపాలపురం గ్రామంలో గిరిజనుల భూమి సాగుకై నాలుగు బావులు రు. 54,000/లు ఖర్చుతో త్రవ్వించబడినవి. వీటివలన గిరిజనుల భూమి సాగుచేయబడు చున్నది. యివి పూర్తి కాబడినవి.

1978-79లో రు. 30000/- వివిధ పంచాయితీ సమితు లకు గిరిజన ప్రాంతాలలో యిరిగేషన్ బావులు త్రవ్వుటకు గాను మంజూరు చేయబడినది.

ఇది కాకుండా రు. 70,000/-లను కన్నవాగు, కట్టవ, మరియు రాచపల్లిపాడు గ్రామాలలోని గిరిజనులకు వ్యవ సాయము అభివృద్ధికొరకై నీటిపారుదల పథకాలు అమలు చేయబడినవి. ఈ పని చురుకుగా కొనసాగుచున్నది. స్టూవర్ట పురం లాండ్ కాలనైజేషన్ సొసైటీ క్రింద చానెల్ రిపేరు చేయించుటకుగాను రు. 6,300/-లు మంజూరు చేయబడినది. గిరిజనుల అభివృద్ధికిగాను నెమళ్ళవాగు మళ్లింపు పథకమునకు

గాను రు. 9,700/- గుంటూరు ఛానల్ ఎగ్జిక్యూటివ్ యింజనీరుగారికి అందజేయటం జరిగింది.

<u>వ్యవసాయాభివృద్ధి :</u>- 1978-79 సం॥ కుగాను 50% సబ్సిడిగా గిరిజన వ్యవసాయదారులకు వారివారి వ్యవసాయ పనిముట్లు కొనుగోలు చేయుటకుగాను రు. 41,0 /- వివిధ బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్ల ద్వారా మంజూరు చేయ బడింది. 174 యస్. టి. బెనిఫిషియర్లకుగాను బాపట్ల, రేపల్లె తాలూకాలద్వారా రు. 17, 100/-లు పురుగులమందులు కొనుగోలు నిమిత్తం సదరు సమితులకు అందజేయ బడింది. మరియు 74 మంది గిరిజనులకొరకు రు. 24,000/- లు ఎద్దులు మరియు ఆయిల్ యింజనులు కొనుగోలు నిమిత్తము సమితి బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్ల ద్వారా నాదెండ్ల, మాచర్ల, రాజుపాలెం ద్వారా మంజూరు కొరకు కేటాయించబడింది.

## మంచినీటి సదుపాయము:-

ఈ సంవత్సరములో రు. 30,000/- గిరిజనులకు మంచి నీటి సదుపాయము కలిగించుటకుగాను బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్ల ద్వారా మంజూరుచేయుట జరిగింది.

## పశుసంవర్ధక శాఖ :-

ఈ విషయములో గిరిజనులు పాల్గొనుటకు 133 మంది గిరిజనులకు 50 శాతం సబ్సిడి క్రింద రు. 66,500/. బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసర్ల ద్వారా గేదెలు కొనుగోలు నిమిత్తం మంజూరు చేయబడింది.

# గుంటూరు జిల్లాలో గిరిజన సంక్షేమాభివృద్ధి కొరకు వివిధ పధకాల క్రింద మంజూరు చేయబడ్డ మొత్తం మరియు ఖర్చుపెట్టబడిన పధకాల పట్టిక.

| వ. నెం. | స్కీము వివరము | మంజూరు చేయబడిన మొత్తము | ఖర్చు చేయబడినది | ఫలితము |
| --- | --- | --- | --- | --- |
| 1. | పెద్యూల్లు ప్రైబ్సు. | | | |
| 1. | ఉన్నతవిద్య స్కాలర్ షిప్పులు | 53,000 | 4,24,378 | 436 విద్యార్థులు |
| 2 | ప్రాథమిక విద్య ,, | 2,27,000 | 2,39,535 | 5538 ,, |
| 3. | ప్రభుత్వ హాస్టళ్ల మెయింటెన్సు | 1 0,45,750 | 10,45,750 | 24 హాస్టళ్లు |
| | | | | 1,852 బోర్డర్లు |
| 4. | ప్రత్యేక పోషకాహార కేంద్రాల మెయింటెన్సు | 5,12,309 | 5,12,309 | 183 నెంబర్లు |
| | | | | 12,9[illegible]1 మంది |

| | | | |
|---|---|---|---|
| 5. స్కూలు పిల్లలకు బట్టలు మరియు నేషనలైజ్డ్ పాఠ్య పుస్తకములు మరియు నోటు పుస్తకములు | 2,47,178 | 2,47,188 | 14,[illegible]2 పిల్లలు |
| 6. చిన్నతరహా నీటి పథకాలు | 15,000 | 15,000 | 1. స్వర్ణపురం కాలువ మరమ్మత్తు 144 ఎకరములు<br>2. నెమళ్ళ వాగు మళ్లింపు పథకము. |
| 7. మంచినీటి వసతి | 30,000 | 30,000 | 4 బావులు |
| 8. పాడి పశువులు తదితర సప్లయి | 66,600 | 66,580 | 133 మంది |
| 9. వ్యవసాయాభివృద్ధి | 41,100 | 41,100 | 248 ,, |

| | | | |
|---|---|---|---|
| 10. టైపురైటింగు మరియు కుట్టు నేర్చుకొను వారికి | 8,511 | 8,511 | టైపురైటింగ్ 8<br>కుట్టు 3 |
| 11. మతాంతర వివాహాలు | 4,000 | 4,000 | జల్గురు దంపతులు |

## 2. డినోటిఫైడ్ ట్రైబ్సు :

| | | | |
|---|---|---|---|
| 1. ఉన్నత విద్య నభ్యసించువారికి స్కాలర్ షిప్పులు | 96,900 | 1,04,283 | 160 విద్యార్థులు |
| 2 ప్రాథమిక ,, ,, | 25,205 | 27,175 | 489 ,, |
| 3. స్కూళ్లు రిపేర్లు మరియు సున్నము వేయించుటకు | 800 | 800 | 8 స్కూళ్లు |
| 4. మధ్యాహ్న భోజన పథకం | 2,100 | 2,100 | 3 సెంటర్లు |

# గుంటూరు జిల్లాలో గిరిజన ప్రగతి

గుంటూరు జిల్లా జనాభా 1971 లెక్కల ప్రకారం 23,44,483. అందులో గిరిజనులు 1,05,470. అంటే సుమారు నూటికి 3.7 వీరి జనాభాగా చెప్పవచ్చు.

గవర్నమెంటు వసతి గృహాలు :- జిల్లాలో 24 హాస్టళ్లు ప్రత్యేకంగా గిరిజనులకొరకు యేర్పాటు చేయబడ్డాయి. అందు 7 బాలికలకు, 17 బాలురకు. ఈ హాస్టలులందు 78-79 సంవత్సరం విద్యనభ్యసించడానికి చేరిన విద్యార్థుల సంఖ్య 1851. వీరికొరకు ప్రభుత్వం 6,57,560 రూపాయలు ఖర్చు పెట్టింది.

ఈ క్రింది ప్రదేశాలలో వసతి గృహాలకు సొంత భవనాలు నిర్మాణం చేయడానికి పథకాలు రూపొందించినారు.

| పేరు | విద్యార్థులసంఖ్య | నిర్మాణానికగు ఖర్చు |
|---|---|---|
| యస్. టి. గరల్స్ హాస్టలు గుంటూరు | 100 | 1.02 లక్షలు |
| యస్. టి. గరల్స్ హాస్టలు నరసరావుపేట | 60 | 1.00 లక్ష |
| యస్. టి. గరల్స్ హాస్టలు బాపట్ల | 60 | 1.00 లక్ష |

మిగిలిన వసతి గృహాల నిర్మాణం కూడా జరగాలనే తలంపుతో ప్రభుత్వం పథకాలను రూపొందిస్తుంది.

## వసతి గృహాలలో ఉండే విద్యార్థులకు వసతులు -

విద్యార్థులందరికీ ఉచితంగా బట్టలు, పుస్తకాలు, నోట్సులు సకాలంలో అందజేయబడ్డవి.

స్కాలర్‌షిప్పులు :- ఈ క్రింది విధంగా స్కాలర్‌షిప్పులు హాస్టలులోని విద్యార్థులకు మంజూరు చేయబడినవి.

| | |
|---|---|
| 1 వ తరగతి | 20/-రూ॥లు. |
| 2 నుండి 7 వ తరగతి | 50/-రూ॥లు. |
| 8 నుండి 10 తరగతి | 70/- రూ॥ లు. |

పదవ తరగతి పైన చదువుచున్న విద్యార్థులకు యీ క్రింది మొత్తాలను పంపిణీ చేయటం జరిగింది.

| | | |
|---|---|---|
| యస్. టి. | 191 మందికి | 1,89,852.45 |
| డి. యస్. టి. | 67 | 30, 257.50 |

రాష్ట్ర గిరిజన వెల్‌ఫేర్ డైరెక్టరు గుంటూరు జిల్లా విద్యార్థులకు గాను యీ క్రింది మొత్తాలను గ్రాంటు చేశారు.

| | యస్. టీస్. | డి.యస్.టీస్. |
|---|---|---|
| పదవతరగతి ఆ క్రింది తరగతులకు | 23,000 | 2,500 |
| పదవ తరగతి పై చదువులకు | 44,000 | 23,500 |

## డి నోటి ఫైడ్ ట్రైబ్స్ కొరకు పాఠశాలలు :-

గుంటూరు జిల్లాలో డినోటిఫైడ్ ట్రైబ్స్ కొరకు ఏకోపాధ్యాయ పాఠశాలను గిరిజన సంక్షేమశాఖ యీ క్రింది ప్రాంతాలలో నిర్వహిస్తుంది.

1. పిల్లుట్ల
2. మంగళగిరి
3. మాచవరం
4. దాచేపల్లి

ఇవిగాక వీరి కొరకు స్టువార్టుపురంలో ఒక హైస్కూలు, ఒక అప్పర్ ప్రైమరీ స్కూల్ సీతానగరంలో ఒక అప్పర్ ప్రైమరీ స్కూలు నడుపబడుచున్నవి. ఈ మొత్తం విద్యాలయాల కొరకు గిరిజన సంక్షేమ శాఖ 78-79 సంవత్సరానికి రూ. 1,12,910 (ఒక లక్షా పన్నెండు వేల తొమ్మిది వందల పదిరూపాయలు మాత్రమే) ఖర్చు చేయుడం జరిగింది. ఈ విద్యాలయములలో చదివే విద్యార్థులందరికి ఉచితంగా పుస్తకాలు యివ్వబడ్డాయి. అంతే గాక ఒక జత బట్టలు కూడ ఉచితంగా యివ్వడానికి యేర్పాట్లు చేస్తున్నారు.

ఈ విద్యార్థులకు మధ్యాహ్నం భోజన సహాయం కలుగజేయుబడింది. అందుకు గాను 1,00,000/- రూపాయలు మంజూరు చేయుబడి ఆ మొత్తాన్ని ఆయా బ్లాకు డెవలప్ మెంట్ ఆఫీసర్లకు పంపించబడింది.

## గిరిజన బాలబాలికలపోషకాహార పథకం -

గుంటూరు జిల్లాలో 183 కేంద్రాలలో 6 సంవత్సరములలోపు 12,9 1 మంది పిల్లలకు పోషకాహారాన్ని సరఫరా చేస్తున్నారు. ఇందుకుగాను రు. 3,31,413 రు 78-79 సంవత్సరానికి ఖర్చు చేయుటానికి యేర్పాట్లు చేయబడ్డవి.

## నిరుద్యోగులకు ట్రైనింగ్ :

1. నిరుద్యోగులైన గిరిజనులకు డ్రైవు, షార్టుహాండు నేర్చుకొనుటకుగాను నెలకు రు. 100 మరియు కాపీలముకు గాను రు. 15/- చెల్లిస్తున్నారు.

2. నిరుద్యోగులైన పట్టభద్రులకు ఆపై చదువుల వారికి నెలకు 100/-లు నిరుద్యోగ భృతి చెల్లిస్తున్నారు.

3. గిరిజనులకు బట్టలు కుట్టడంలో ట్రైనింగ్ యిస్తూ వారికి నెలకు రు. 100/-లు చెల్లిస్తున్నారు.

4. కారుడ్రైవింగ్ 27 మంది గిరిజనులకు విజయ వాడలో శిక్షణఇస్తూ వారికి నెలకు రు.100/- యిస్తున్నారు. వారికి ట్రైనింగ్ పొందినతరువాత ఉద్యోగాలు వచ్చే యేర్పాటు చూస్తున్నారు.

5. గుంటూరు జిల్లాలో 3509మందిగా గిరిజనులు చెంచు వారి అభివృద్ధి గాను మొదటిదశగా ఒక్కొక్కరికి రు 1000/-ల చొప్పున 214 మందికి రు. 2, 13, 000 లోనుగా ఇవ్వడం జరిగింది. ఇంకనూ 2 లక్షల రూపాయలతో మిగిలిన వారికి సహాయం చేయుటానికి పథకాలు తయారు చేశారు.

## ఆర్థికాభివృద్ధి పథకాలు :-

గుంటూరుజిల్లా గిరిజన ఆర్థికాభివృద్ధికిగాను యీ క్రింది పథకాలు రూపొందించారు.

1. గోపాలపురం గ్రామంలో వ్యవసాయపు బావుల నిమిత్తం కవవాగు, కట్టక, రాచపల్లిపాడు గిరిజనుల ఆర్థికాభి వృద్ధికిగాను రు. 70,000/-లు 77-78 సంవత్సరానికి మంజూరు చేయబడ్డది. ఈ 1978-79 సంవత్సరానికి గాను రు 5,300/- మంజూరుచేసి కార్యక్రమాన్ని విస్తృత పరుస్తున్నారు. స్టువార్టు పురవాసులకు గాను రు. 15,000లు వ్యయపర్చ బడింది.

2. వ్యవసాయాభివృద్ధికిగాను రు. 23,200లు యీ సంవత్సరానికి మంజూరు చేయబడ్డది.

## పశు సంవర్థకోత్పత్తి -

పశువుల పెంపకానికి గాను రు 11,600/-రూపాయలు మంజూరు చేయబడ్డవి.

## స్టువార్టుపురం, శీతానగరం అభివృద్ధి -

పై రెండు గ్రామాలలో నివసించు గిరిజనుల సర్వతో ముఖాభివృద్ధికిగాను జిల్లా కలెక్టరు అధ్యక్షులుగా ఒక కమిటీ యేర్పడి కృషి చేస్తుంది.

జిల్లా రిక్లమేషను ఆఫీసరుగారికి ఒక యు.డి అకౌం టెంట్, ఒక గుమస్తా మాత్రమే యున్నందున ఫీల్డుస్టాఫ్ కొరతవల్ల పనులు చురుకుగా జరుగుటలేదు అందుచేత డైరెక్టర్ ఆఫ్ ట్రైబల్ వెల్ఫేరు వీరు 2 యు.డి. రెవిన్యూ

ఇన్స్పెక్టర్లను, ఒక లైవిస్టును, ఒక గుమాస్తాను పోస్టు చేయ వలసినదిగా కోరుచున్నారు.

## నక్కలవాండ్లు

నక్కలవాండ్లు అనే జాతి తెలుగు జాతికి చిరపరిచితము. వారు గ్రామాలలో ఉండక పోయినా, ఊరికి దూరంగా విడిది చేసి మరలా మకాం మార్చి సంచారం చేస్తూనే ఉంటారు.

వీరు నక్కల్ని చంపి తింటారు గనుక వీరికి నక్కల వాండ్రని పేరు వచ్చింది. వీరి పుట్టుక గురించిన ఆధారాలు పూజ్యం. కాని వీరి వేష భావల్ని శరీరసౌష్టవాన్ని, రంగులను బట్టి పరిశీలించినట్లయితే వీరు ఆది ద్రావిడజాతికి చెందిన వారై యుంటారని చెప్పవచ్చు.

ఆర్యుల దురాక్రమణ ఫలితంగా స్థానభ్రంశం చెందిన వీరు, ఆర్యులకుతలయొగ్గక స్థిరనివాసం లేక దేశదిమ్మరులుగా మారారు. ఆనాటి నుండి నేటివరకు వారు సంచార జాతుల వారే. వీరి జనాభా చాలా తక్కువ. అందుచేతను వారు స్థిరనివాసులు కాకపోయినందునను వీరు యింతమందని చెప్ప లేము. మొత్తంగా పరిశీలిస్తే వీరు ఆంధ్రదేశంలో 10 వేల మందిగా యుండవచ్చు.

వీరు స్వాతంత్ర్యప్రియులు, జంతుజాలాన్ని వేటాడి పొట్ట నింపుకొంటారు. కూలీ, నాలి పనులు వీరికి గిట్టవు. ఒకరిక్కి

గృహావసతి, జీవనవిధానాలను ఏర్పాటు చేయాలి. వీరికి వయోజనవిద్యతో పాటు, వీరి పిల్లలకు విద్యాభ్యాసం ఉచిత భోజన సదుపాయాలు, ఉద్యోగాలు మొదలుగాగల అవకాశాలను కల్పించాలి.

అట్లా కల్పించిన నాడు వీరి మనోవికాసం అభివృద్ధి చెందుటయేగాక, వీరిలో నవచైతన్యం పెల్లుబికి వారు తోటి సోదర మానవుల వలె పైకి రావాలని, సమాజంలో కలసి పోవాలని అభిలాష చెంది పురోగమిస్తారనటంలో అతి శయోక్తి లేదు.

## పూసలవాండ్రు

తెలుగునాటి ముఖ్యపట్టణాలలోనే గాక భారతదేశ పట్టణాలలో పూసలు పరిచి రకరకాల పూసల దండలు కట్టి, చిన్న చిన్న నిత్యజీవిత పరికరాలను రోడ్లమీద పరచుకొని అమ్ముకొనే తెగ పూసలవాండ్రు.

వీరి పుట్టుక, వీరిభాష, వేషం, ఆకృతి, అనాగరిక ప్రవృత్తులను బట్టి వీరి సంతతి ఆది ద్రావిడ సంతతిగా చరిత్ర కారులు చెప్పకపోయినా పరిశీలిస్తే తెలిసే సత్యం.

వీరి జీవిత విధానం అతి విచిత్రం. వీరు రోడ్లపైనే సంసారాలు సాగిస్తు ఉంటారు. వీరికంటూ యిల్లు వాకిళ్ళు లేవు. వీరి దాంపత్య జీవితం చాలా గొప్పది. భార్యభర్తలు ఒకరి నొకరు వదలి యుండరు.

చిన్న పిల్లలప్పుడే వీరికి పెండిండ్లు చేయటం మూలంగా వీరికి సంతానం తొందరగా యేర్పడడం, చిన్న చిన్న పడతులు పిల్లల్ని చంకన కట్టుకొని చిందర వందరగా కనుపిస్తారు.

ఈ పూసలవాండ్రను పరిశీలించినప్పుడు వారి తెగ గురించి ఆలోచించినప్పుడు లెక్కలకోసరం అన్వేషణ జేస్తే సువకేమీ లభ్యంకాదు. కారణం వీరు తరచూ వలసపోతూ యుండుటచే వీరికి ఒకచోటంటూ లేదు.

వీరి భాష గురించి పరిశీలిస్తే రాష్ట్రానికి, రాష్ట్రానికి వీరి భాషలలో వ్యత్యాసముంది. స్థూలంగా పరిశీలిస్తే వీరిది అద్రావిడ భాష యనేది స్పష్టమౌతుంది.

స్వాతంత్ర్య మొచ్చి 36 సంవత్సరాలయినా వీరికి నాగరికతయొ అబ్బలేదనేకన్న యెవరూ వీరిని నాగరికులుగా తయారుచేయటానికి ప్రయత్నించలేదు.

వీరు లైంగిక వ్యవహారాలు కూడ బహిరంగప్రదేశాలలో చేయటం, చాపచుట్టి చంకబెట్టి అనే విధంగా వీరు సంసారాన్ని వారికి కావలసిన పనిముట్లు తయారు చేసుకొన్నారు.

చిన్నతట్టలో పూసలుదండలు, కత్తులు దువ్వెనలు, సూదులు, పిన్నీసులు వేసుకొని రోడ్డుమీద వాటిని వేసుకుని కూచి పెట్టుకొని పిండ్లాంపిల్లల్ని ప్రక్కనే పెట్టుకొని అమ్మకంసాగి

స్తారు. ఆ ప్రక్కనే రాళ్ళు పెట్టుకొని వంటచేసుకొని అక్కడే తినేస్తారు.

వీరికి మద్యం బాగా అలవాటు వీరు యెప్పుడూ నిషా లోనే యుంటారు. భార్యాభర్తలు పోట్లాడు కొంటే యెడా పెడా కొట్టుకుంటారు. మరలా నిముషంలో కలిసిపోతారు. వీళ్ళకు పెద్దలు గిద్దలు లేరు. వీరి కోపతాపాలు క్షణికం,

పూసలవాండ్రు మనరాష్ట్రంలో చాలా తక్కువ మందే యున్నందున పెద్దలు పూనిక వహిస్తే వీరిని అయిదు సంవత్సరాలలో అభివృద్ధి చేయవచ్చు. కాని చేసేదెవరు ? వీరి యునికిని గుర్తించని పెద్దలు వీరికై కృషి చేస్తారు అని అనుకోవటం భ్రమగానే కనుపిస్తుంది. అందుచేత గిరిజనులుగా యున్న పెద్ద తెగల విద్యార్థులు వీరి కొరకు కొంచెంకొంచెం అలోచించడం యీ పూసలవాండ్రు కూడా తమ తెగ వారనే విషయాన్ని గుర్తించవలసిందిగా కోరుచున్నాను.

గిరిజనులలో యెన్ని తెగలున్నను వారంతా మొదట ఒకే తెగకు చెందిన వారనే విషయాన్ని విస్మరించరాదు. వీరంతా ఆది ద్రావిడ సంతతికి చెందిన వారనేది నిర్వి వాదాంశం. వారి వారి మనో ప్రవృత్తులను బట్టి వారవలం బించిన పద్ధతుల మూలంగా వెనుకబడి పోయారనే సత్యాన్ని మొత్తంగా గిరిజనులు గుర్తించాలి.

కొండల్లో యున్నా, అడవుల్లోయున్నా, పట్టణాలల్లో యున్నా, గ్రామాలలోయున్నా నాగరికతలో విలక్షణంగా యున్నా, భాషవేరుగా యున్నా వీరంతా వకే తెగకు చెందిన వారవటం మూలంగానే వీరికి గిరిజనులనే పేరు పెట్టడం జరిగిందనే విషయాన్ని విస్మరించరాదు.

పూసలవాండ్రు దయనీయ స్థితిలో, నాగరికత విల్లి విరిసిన పట్టణాల నడిబొడ్డ వెంబడే అనాగరికంగా, అసభ్యంగా, దిష్టిబొమ్మల్లా యుంటూ జీవచ్ఛవాలవలె యున్న యీ పూసలవాండ్రు గురించి పట్టించుకొనక తమకేమీ కానట్లు, వారేవో క్రొత్త తెగకు చెందిన వారలుగా చూస్తూ వప్పుకొంటూ పోవటం విచారకరం.

సభ్యమానవాళిలో భాగంగా అసభ్యంగా యున్న వారిని మలచవలసిన బాధ్యత మన అందరికీ యున్నది. ఈ పూసలవాండ్రను సంస్కరించి తీరాలి. వీరి స్థితిగతులను మార్చాలి. వీరిలో అంతరించిపోయిన నాగరిక ప్రవృత్తిని రేకెత్తించాలి. నాగరికత విలువల్ని, సభ్యతా సభ్యతలను వీరు గుర్తించి వారున్న స్థితికి సిగ్గుపడి తిరుగబడి సమాజంలో వారుకూడా సమానంగా యుండాలనే తలంపుతో పురోగమించాలనే తలంపుతో పురోగమించేటట్లు చేయాలి.

గతంలో ఆదిద్రావిడులుగా ఔన్నత్యం కల్గి సర్వ మానవ సమతకు అంకితమైన తమ జాతి యిట్లా కావడానికి

కారణాలేమైనా పూర్వపు ఔన్నత్యాన్ని వీరు సంతరించుకోవటానికి కార్యోన్ముఖులుగా చేయడానికి కృషి జరగాలి.

వీరిని ప్రత్యేక తెగగా దూరంగా యుంచే కన్న గిరిజనుల్లో భాగంగా కలిపేసే ప్రయత్నం జరగాలి. వారికి గిరిజన ప్రజలు నివసించే ప్రాంతాలలో స్థిరనివాసం కల్పించి వారి జీవన విధానాలను వీరికి నేర్పించాలి. ప్రత్యేక సదుపాయాలను వీరికి కల్పించి వీరి ఉద్ధరణకు పూనిక వహిస్తే కొద్దికాలంలోనే వీరు అభివృద్ధి చెందుతారు లేకపోయిన సభ్యతానాగరికలోకంలో అనాగరికంగా దిష్టిబొమ్మల్లా నిలిచి మన అనాగరిక ప్రవృత్తిని చాటి చెబుతూ యుంటారు.

## గిరిజనుల సంక్షేమానికి ఏమిచెయ్యాలి

మనకు స్వాతంత్ర్యంవచ్చి మూడు దశాబ్దాలు అయినా కూడా దేశంలోని గిరిజనుల పరిస్థితిలో మార్పు కనిపించక పోవడం చాలావిచారాన్ని కల్గించుతుంది. ప్రతిది ప్రభుత్వ పరంగానే జరగాలి అంటే వీలుపడదు ముఖ్యంగా ఈ గిరిజనుల సంక్షేమ కృషికి ఒకవేపు ప్రభుత్వమూ, ప్రజలూ ప్రజాసంస్థలూ ఉమ్మడిగా కృషిచేస్తే ఇదేమంత ఘనకార్యం కాదేమో అనిపిస్తుంది.

ఈ గిరిజన సంక్షేమానికి ఏమిచెయ్యాలి అని ఆలోచిస్తే ముఖ్యంగా విద్య - వైద్య సదుపాయాలను వా

పూర్తిగా అందుబాటులో వుండేటట్లు చేయాలి. ప్రభుత్వం తనకు చేతనైన విధంగా కృషిచేస్తూ వున్నది. కానీ ప్రయోజనం ఆశించినంతగా కనిపించటంలేదు. దీనికి చాలా కారణాలు వున్నాయి. ముఖ్యంగా వారి వారి జీవన విధానం. వీరికి ప్రత్యేకంగా ఒక వృత్తి కని అంటూ లేదు. అందరూ కూలీ చేసుకొని జీవించవలసిందే. ఈ కూలీ కూడా పట్టణాలలో, గ్రామాలలోలాగా కాకుండా చాలా స్వల్పంగా వుంటుంది. అందుచేత రోజల్లా ఇంటిల్లిపాది చిన్నా, పెద్ద, ముదుసలి శ్రమిస్తే కాని వారి వారి కుటుంబాలు జరుగవు. ఈ పరిస్థితులలో వారిదృష్టి విద్య పైకి ఎట్లా మళ్ళుతుంది. అదేవిధంగా వైద్య సదుపాయాలు కూడా. ఏ జబ్బువచ్చినా ఆకు పసరులు వేసుకొంటారే తప్ప ఆసుపత్రులకు పోరు. ఒక విధంగా చూస్తే ఈ ఆసుపత్రులంటే వీరికి భయం కూడా.

కనుక ఈ గిరిజన సంక్షేమానికి ప్రజలూ, ప్రభుత్వం ప్రజాసంస్థలూ కలసి ముఖ్యంగా ఈ క్రింది సదుపాయాలు కలుగ జేస్తే వుపయోగకరంగా వుంటుంది.

1. విద్య :- ఎ) ఈగిరిజనులలో ఉన్నతవిద్య పొందిన వారు ఒక్కరూ లేరు. వారికి ప్రాథమిక విద్యే కరువైతే ఇక వున్నతవిద్య ఎట్లావస్తుంది. ఇందుకుగాను ప్రతికుటుంబములోని ఒక్కబాలునికి (Compulsory Education) తప్పని సరి విద్యాపద్ధతిలో ప్రత్యేకమైన విద్యాలయాలను ఏర్పాటు

చెయ్యాలి. ఈగిరిజనులు ఆర్థిక బలహీనులు కాబట్టి ఈ విద్యాలయాలలో చేరే ప్రతివిద్యార్థికి అన్నివుచిత సదుపాయాలతో బాటు వారి తలిదండ్రులకు చేరునట్లు కొంత వుపకార వేతనం ఏర్పాటు చేస్తే ఈబాలురను అటు కూలీపనులకు కాక విద్యాలయాలకు పంపేదానికి వారివారి తలిదండ్రులు సుముఖులుగా వుంటారు.

బి) ఇదేవిధంగా వీరికి వయోజన విద్యకూడా చాలా అవసరం. ఎంత ఖర్చయినా ఈ వయోజనవిద్యను గిరిజన ప్రాంతాలకు విస్తరింపచేయడం వీరి సంక్షేమానికి చాలా అవసరం.

2. <u>వైద్యసదుపాయాలు :-</u> వైద్య సదుపాయ విషయంలో వారి మూఢాచారాలను మార్చుటకుగాను వైద్యులైనవారు వారిలో ఒకరిగా మెలగి ఆధునిక వైద్యవిషయాలనూ వాటి అవసరములను వివరించి వారిపై తోటి గిరిజనులకు భక్తి, గౌరవము, అభిమానము కలుగునట్లు వ్యవహరించవలెను. ఇది చాలా ఓర్పు నేర్పుతో కూడిన విషయం. అందుచేత సంఘసేవయందు ఆసక్తికల్గిన వైద్యులను ఇందుకు వినియోగించిన మనకు సత్ఫలితములు కనబడును. ఇందులకుగాను ముఖ్యంగా ఒక ఆస్పత్రి – 1 లేక 2 డిస్పెన్సరీలు 2 లేక 3 సంచార వైద్య బృందాలను ఏర్పాటు చేయవలసి యున్నది.

3. ఉమ్మడి వ్యవసాయము :– పై రెండూ ఆరోగ్యం విజ్ఞానాన్ని పెంచితే ఇది ఆర్థిక స్తోమతను పెంచుతుంది. అప్పుడు ఈ గిరిజనులు తోటిమానవులతో సమానంగా సంఘంలో ఒక స్థానమును సంపాదించుకో గల్గుతారు.

ఈ ఉమ్మడి వ్యవసాయానికి ఒక వ్యవసాయ క్షేత్రమును ఏర్పాటుచేసి – దాని పరిమితిని బట్టి కొన్ని కుటుంబాలను ఈ ఉమ్మడి వ్యవసాయానికి తీసుకోవలెను. వీరు వారి వారికి కేటాయించిన భూములను, ప్రభుత్వ సహాకారంతో శ్రమించి వివిధమైన పంటలను పండించి వాటిని ప్రభుత్వమునకు సరియైన వెలకు ఇచ్చి ఆవచ్చిన ఫలితమును సమంగా అన్ని కుటుంబాలు పంచుకొనుటతో వారిలో ఒకరిపై ఒకరికి సహజమైన స్నేహమూ అభిమానమూ పెంపొందుటకు వీలు కల్గుతుంది.

పై తెలిపిన విధానాలు ఉపన్యాసానికి సులువుగానూ– ఆచరణకి కష్టసాధ్యంగాను వుంటాయి. కానీ కార్యదీక్ష కల వారు దానిని చేపట్టిన ఇది ఏమంత కష్టసాధ్యంకాదు. వారి కృషికి చేదోడు – వాదోడుగా ప్రజలు ప్రభుత్వము మరికొన్ని ప్రజాసంస్థలు వారి వారి సహాకారాన్ని అందచేసిన వారి కృషి చరితార్థం అవుతుంది.

పై చెప్పిన విధంగా ఈఅన్ని అంశములను దిగ్విజయముగా నడపిన సంస్థ నీలగిరిలో "నీలగిరి ఆదివాసి వెల్ ఫేర్ అసోసియేషన్" పేరిట ఒకటి వున్నది. ఈసంస్థ సుమారు

తె దశాబ్దములకు పైగా పై కార్యక్రమములతో గిరిజనులకు సేవచేయుచున్నది. ముఖ్యంగా ఈసంస్థ ఆనరరీ శక్రటరీగా వ్యవహరించి దివంగతులైన డా॥ యస్. నరశింహన్ గిరిజన సంక్షేమానికి సుమారు 40 సం॥లుగ చేసిన సేవలను అభినందించకుండా వుండలేము.

వీరు వృత్తిరీత్యా డాక్టరు. అయితే వీరు వారిలో ఒకరుగా, వారితోనే కలసి జీవించి ముందుగా వారికి ఆప్పుడె వారి ఆరోగ్య పరిస్థితిని మెరుగుపర్చుటకు కృషిచేసి వారికి అనుగుణంగా మెసలి, వారి మన్ననలకు ఈనాడు పాత్రులయిన పూజ్యులు డా॥ నరసింహన్ గారు.

డా॥ యన్. నరశింహన్ గారు చివ్వరి క్షణం వరకు కూడా ఈ గిరిజనులకు సేవచేయడం వారిలోని విశేషం. ఆయన జబ్బుతో వుండి కూడా ఈ గిరిజన సంక్షేమ సర్వసభ్య సమావేశానికి అతి ప్రయాసతో 40 మైళ్ళు ప్రయాణంచేసి సమావేశానికి హాజరయి తమ మిత్రులకూ వర్కర్లకు, గిరిజనులకు తన చివ్వరి సందేశాన్ని ఇచ్చి ఈ సమాజానికి సంఘు సంస్కర్తగా నిలిచారు.

డా॥ నరశింహన్ ఆయుర్వేద, అల్లోపతి వైద్యాలలో మంచి అనుభవంకల వైద్యులు సుమారు 40 సం॥ ల క్రిందట నీలగిరి ప్రాంతాలలోని కోటగిరి అనే పల్లెలో ఒక చిన్న ఆసుపత్రిని ప్రారంభించి ఈ గిరిజనుల సేవకు పూనుకున్న

మహార్షి 1958 వరకు అన్ని ఖర్చులూ తనే భరించుచూ ఈ ఆసుపత్రిద్వారా గిరిజనులకు సేవచేసినారు. మహారాష్ట్ర వాసి అయిన ఫిరోజ్ గాంధీ ఈ గిరిజనుల సేవకు డా॥ నరశింహన్‌కు చేదోడు వాదోడుగా నిలిచి అనేక సంస్థల ఆర్థిక సహాయం కొరకు విజ్ఞప్తి చేసిరి. ఆశించిన ఫలితం దొరకక పోయినా ఈ ఉభయులూ ఎన్నో వ్యయ ప్రయాసలకు ఓర్చి కట్టుదలతో గిరిజన సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించు చునే యున్నారు. వీరి కార్యదీక్షా, సేవలను ప్రభుత్వమూ, ప్రజలు గుర్తించి వివరాలద్వారా వీరి కార్యకలాపాలకు ప్రోత్సాహాన్ని ఇచ్చి 1978 నాటికి వీరిది ఒక మహాసంస్థగా నిలిచి ప్రోత్సాహకరమైన ఫలితాలను ప్రజలకు చూపిరి. వీరి కృషిలో సాధించిన ఘనవిజయాలు.

1. కొల్లికరై గ్రామంలో నర్సరీ స్కూలు :

1978 నాటికి లోగడవున్న మట్టి యిండ్లు, పాకలస్థానే ఒక సుందర భవనాన్ని ఏర్పాటు చేసిరి. ఈ కార్యక్రమానికి మన దేశస్థులేకాక విదేశీయులు సైతం ఈ సేవలలో పాలుపంచు కోవడం ఒక గొప్ప విశేషం. ఈ పాఠశాలలో పిల్లలకే కాక వారి తల్లిదండ్రులకు సైతం వయోజన విద్యాసౌకర్యములు కల్పించిరి.

2. నీటిసదుపాయం :- ఇక్కడి ప్రజలకు, ఆసుపత్రికి, స్కూలుకు సుమారు 33,000 రూపాయలు ఖర్చుతో

గ్రామంలో కరెంటు కంపుసెట్టు పైపులైనులను వేసి నీటివసతి పాయాలను కల్పించిరి.

3. విద్యాదాన వ్యాప్తి : ముఖ్యంగా గిరిజనులైన వారు 100కి 100 పాళ్ళు శ్రామికులు. రోజల్లా ఇంటిల్లిపాది శ్రమపడి పనిచేస్తేగాని వారికి జీవనం కలగదు. అందుచేత ఈ ప్రాంతాలలో ప్రజలకు విద్యావిషయమై చేయు ఖర్చు అంతా వ్యర్థమవుతున్నది. దీనికి కారణం ప్రతిఒక్కరూ కూలికి పోవడం వీరి జీవన వ్యవస్థకు అవసరం అందుచేత ప్రతి కుటుంబమునుండి ఒక బాలుని స్కూలుకు పంపునట్లు చేసి ఆపిల్లవానికి ఉచిత విద్యతోపాటుగా ఉపకార వేతనంగా కొంతడబ్బును ఇచ్చిన వారితల్లిదండ్రులు సంతృప్తిచెంది వారివారి పిల్లలను స్కూలులకు పంపెదరు.

4. వైద్య సదుపాయములు :- ఈ గిరిజన ప్రజలకు ఆస్పత్రి వసతులలో అనగా అంబ్యులెన్సు, X-Ray, ఆపరేషన్ థియేటరు మొదలుగా అన్ని సౌకర్యములను కల్పించి వీరికి పూర్తి వైద్య సహాయము అందుబాటులో వుండునట్లు కృషిని చేయుట.

పై సౌకర్యములను కల్పించుటలో ఈ ఆదివాసి వెల్ఫేర్ అసోసియేషన్‌కు అనేక సంస్థలూ, ప్రజలు, ప్రభుత్వము ఎంతో సహకారాన్ని అందించినట్లుగా పై అసోసియేషన్ యాన్యువల్ రిపోర్టునందు స్పష్టంగా తెలుపబడినది.

...

# డా॥ బి. ఆర్ అంబేద్కర్ సూక్తులు

1. బానిస బానిసత్వం బాపుకోవాలి. బానిసత్వం బాపుకోవటానికి ఏ దేవుని మీద గాని, ఏ మహాత్ముని మీద గాని ఆధారపడకూడదు. బానిసత్వము రాజకీయ అధికారముతో ముడివేయ బడియున్నది కాని, తీర్థయాత్రలతోను ఉపవాసములతోను బంధింప బడలేదు. పవిత్రగ్రంథాలలో దేవతలను పూజించినంత మాత్రాన బానిసత్వము, కటిక దారిద్ర్యము, సాంఘికమైన బాధ్యత, దురంతాల నుండి విముక్తి చెందలేదు. తరతరాలుగా వీరు చింపిన బట్టలనే ధరించుచున్నారు. రోగాలతో - రొచ్చుగుంటలవద్ద నివాసములతో వీరి జీవితాలు బలిచేయ బడినవి. వీరి వ్రతాలు, పూజా పిండప్రదానాలు, మత ఆచారాలు, గీతా పారాయణాలు వీరిని బానిసత్వము నుండి విముక్తి చేయలేవు. అన్యాయాన్ని తెలుసుకొని తీవ్రమైన ఉద్యమాన్ని నడపాలి.

2. నవసమాజ నిర్మాణము ప్రార్థనలతోను, నినాదములతోను జరుగదు. దానికి విప్లవమే శరణ్యము. హేతువాదములేని శాస్త్రజ్ఞానం ఎంత గొప్పదైనా అది మానవులకు మాత్రము నిరుపయోగము.

3. ప్రపంచమములోని పీడిత ప్రజలు అభ్యుదయమును సాధించినారంటే అది కేవలము ఇతరుల దయా, భిక్ష, మాత్రము కాదు. స్వయం సహాయము కాదు స్వశక్తి ద్వారానే.

4. దేశములోని అధికారాన్ని హస్తగతము చేసుకోడానికి బలహీన వర్గాలన్నిటిని ఒక రాజకీయ సిద్ధాంతము క్రింద ఏకమై బలీయమైన ఉద్యమాన్ని నిర్మించాలి.

5. పీడిత విద్యార్థులారా! మేల్కొనండి, కదలండి, సమైక్యమకండి, శ్రమించండి, మీ జాతినంతా బానిసత్వము నుండి విముక్తి చేయ డానికి శ్రమిస్తున్నామని నిరూపించండి.

# కావ్యకర్త : ఘాక్యా చిన వెంకటేశ్వర్లు



జన్మస్థలము : దుర్గిగ్రామము, పల్నాడుతాలూకా, గుంటూరుజిల్లా (ఆ.ప్ర.)

జనన తేది : 1–8–1952

విద్యాభ్యాసము : జిల్లాపరిషత్ హైస్కూలు, దుర్గి.
ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.

ముఖ్యవృత్తి : ఆంధ్రరాష్ట్ర గిరిజనసంక్షేమ సంఘము Reg. No. 119/75 నకు వ్యవస్థాపకులుగా, అధ్యక్షులుగా ఉన్నారు. ఏ. పి. యస్. ఆర్. టి. పి. గుంటూరు డివిజనుకు ప్రధానకార్యదర్శిగాను, నాగార్జున విశ్వవిద్యాలయమునకు సెనెట్ సభ్యులుగాను, గుంటూరు జిల్లా షెడ్యూల్డ్ ట్రైబ్స్ యూత్ క్లబ్ అధ్యక్షులుగాను, ట్రేడ్ యూనియన్ నాయకులుగా సేవలు చేయుచున్నారు.

"నవత" పక్షపత్రికకు ఎడిటరుగా యుండి పత్రికారంగమునకు సేవ చేయుచున్నారు.

స్థిరనివాసము : గుంటూరు.